నాటకాస్త్రమే కవిత్వమ్మను నానుడి సంస్కృతసారస్వతములో విశిష్టమై వెలసి యున్న మాట స్పష్టము. తెలుఁగున ఛందస్సు మూచూచిన మాత్రాన నాటకమును వ్రాయుట కొందఱ కీనాఁట పరిపాటి కావచ్చునుగాని— అది శాస్త్రీయముగా— చెల్లని బాట. పూర్వులు మహాకవులుసైతము తెఱఁగులో రూపకములు వ్రాయకుండుటకు కారణము అది వేఱు ; అది యొక పెద్దగాథ.

సంస్కృతములో దశరూపకముల కున్న ప్రాభవము మిక్కిలి దొడ్డది. అందు సిద్ధహస్తులై కృతార్థులైన వ్యక్తులే మహాకవులని పరిగణన. భాసుఁడు - కాళిదాసు - భవభూతి ప్రభృతులు రూపకకర్తలుగా ప్రపంచములో అత్యంతము భాసించిరి.

పురాతనములగు దశవిధరూపకములలో మృచ్ఛకటికము ప్రఖ్యాతి నెందిన ప్రకరణము. శూద్రకుఁడను పేరు కల క్షత్రియకవిసత్తముఁడు దానికి కర్త. ఆయన సమరవ్యసనిగా - పరవారణబాహుయుద్ధలుబ్ధుఁడుగా - క్షితిపాలుఁడుగా మాత్రమే గాక వేదవేత్తగా తపోధనుఁడుగా సైతము పేరుమోసిన మహాకవి. కథాకల్పనములో - వ్యవహారదక్షతాపరీక్షలో - పాత్రౌచిత్యనిరూపణములో - రస విషయప్రపంచములో మృచ్ఛకటికమువంటి రూపకము సంస్కృతసారస్వతములో మఱియొకటి లేనేలేదు.

ఇందు - చారుదత్తుఁడు నాయకుఁడు; వసంతసేన నాయిక; శకారుఁడు ప్రతినాయకుఁడు. చారుదత్తుఁడు వ్యవహారజ్ఞానము కలిగి వ్యాపారములో ఆరితేఱిన సుగుణవంతుఁడు-వదాన్యశిరోమణి అనిపించుకొని దరిద్రుఁడైపోయిన ఒక బ్రాహ్మణుఁడు. గుప్పిళ్ళకొలఁది సొమ్ము మెప్పుగా ప్రోవుచేసి మేడలు మిద్దెలు కట్టి ఉజ్జయినిలో పేరుమోసిన ఒక వెలయాలికి కడుపునఁ బుట్టి అందగత్తె శీలవతి అనిపించుకొన్న కన్నెమిన్నె వసంతసేన. ఆ యిరువురి ప్రేమవాహినికి అంతరాయము కలిగింపఁజూసిన మహాధూర్తుఁడు శకారుఁడు. రాజు ఉంపుడుగత్తెకు వాఁడు తమ్ముఁడగుటను నిలువెల్ల వికారబుద్ధియే కలిగినవాఁడు కాపుటను - వాఁడు ఆడినదే ఆటగా పాడినదే పాటగా ఆనాఁడు దేశమం దెల్లెడల చెల్లిపోయెను. ఈ మువ్వురే ఇందలి ప్రధానపాత్రలు.

నాఁటి దేశీయపరిస్థితులు రాజకీయపుగొడవలు ప్రజాపరిపాలనము - ఇత్యాది విశేషాంశము లెన్నో ఈ మహాకవి ఈ రూపకములో చిత్రవిచిత్రముగ అపూర్వధోరణిగ చిత్రించియున్నాఁడు. బ్రదికి చెడి దరిద్రుఁడైపోయిన చారుదత్తుని బిడ్డకు ఆడుకొనుటకు మట్టిబండియే గతియై యుండుటఁబట్టి ఈ రూపకమునకు మృచ్ఛకటిక మను పేరు వచ్చెను. ఇందలి కథావైచిత్రికి అబ్బురమంది ఎందఱెందఱో దేశ్యభాషలలో వింతపోకడలలో దీనిని అనువదించుకొనిరిగాని మన తెలుఁగులో నా యెఱుక యున్నంతవట్టు ఇర్వురు మువ్వురు తక్క అంతగా దీనిని చిత్రింప

రై పి. నవరసభరితమైన రూపకము గాపునను - కథావిధానవైఖరి అద్భుతావహము అవుటను దీనిని తెలుఁగునకు తేవలెనని నాకును మనసు కలిగి దీనికి ఈ రూపు రేఖలు దిద్దితీర్చితిని. ఆద్యంతము చారుదత్తుని ప్రస్తావము విశిష్టముగా వర్ణితమై యుండుటచే చారుదత్తమని పేరు మార్చి నేఁటి విద్యాప్రణాళికకు అనువగు ఒకానొకబాటలో ఈ కథను నడపించితిని.

స్వాతంత్ర్యమహోత్సవమాధుర్యమును మొన్ననే చవిచూచిన నవభారతమునకు - ఇట్టి కథలలో ఔచిత్యము గట్టిగా ఒంటఁబట్టు ననుమాట వట్టిది గాదు. నిరంకుశమూర్తులగు రాజులు - అమాయికులగు ప్రజలు. నడుమనడుమ క్షామక్షోభములు - అందులో విప్లవభావతరంగములు - రాజ్యపరిణామములు ఇత్యాదిఘట్టములు మిక్కిలిగ వర్ణించిన ఈ గ్రంథము తెలుఁగువారికి అక్కఱకు వచ్చునని నిరాతంకముగ చెప్పవచ్చును. అందును నవలగా - నాటకముగా - వచనకావ్యముగా - రూపవాణిగా అత్యంతము రాణింపనోఁచిన ఈ యితివృత్తము చదువరులకు ముచ్చట యిచ్చునవియే తలంతును.

దిక్సూచి యగు - ఈ మాత్రము పరిచయముతో ఈ కథారంగములో చొచ్చి పాఠకులు ఆనందింతురని పదింబదిగ ఆశింతును.

— సత్యనారాయణచౌదరి.

ప్రధానపాత్రలు:—

చారుదత్తుడు .... కథానాయకుడు - కుశావతీక్ష్మాపాలుడు
పాలకుడు ..... మాలవదేశాధీశ్వరుడు
శకారుడు ..... రాజశ్యాలకుడు - రాష్ట్రాధికారి - పరమదుష్టుడు
శర్విలకుడు..... బ్రాహ్మణుడు - చోరుడు - రాజ్యవిప్లవకర్త
ఆర్యకుడు ..... గోపాలుడు - శర్విలకుని మిత్రుడు - నూతనమహారాజు
సంవాహకుడు ... జూదరి - శాక్యభిక్షుడు
స్థావరకుడు .... శకారుని బండివాడు
వర్ధమానుడు .... చారుదత్తుని బండివాడు
మైత్రేయుడు .... చారుదత్తుని నెచ్చెలి - బ్రాహ్మణుడు
రోహసేనుడు ... చారుదత్తుని బిడ్డ
చందనకుడు .... దండపాలకుడు
వీరకుడు....... దండపాలకభటుడు
తలారులు ...... దోషులను వధించువాండ్రు
ధూతాంబ ...... చారుదత్తుని యిల్లాలు - పరమపతివ్రత
రదనిక ....... ఆమె దాసి
వసంతసేన ..... కథానాయిక - వారవనితారత్నము - గుణవతి
మదనిక ....... ఆమె దాసి

ఓం

# చారుదత్తము

## మొదటి ప్రకరణము

ఉజ్జయినీపురములో సజ్జనశిరోధార్యుఁడు చారుదత్తుఁడని బుద్ధిమంతుఁ డొకఁ డుండెను. ఆతని తండ్రి సాగరదత్తుఁడు; తాత వినయదత్తుఁడు. వారు – ఆనాఁడు బేరసారములు పెద్దయెత్తున నడపించి ధనవంతులలో అగ్రిమస్థానమునే పడసిరి. వారు వ్యాపారిబ్రాహ్మణులు. వృత్తి వర్తకము. వర్తక వీధిలో వారికి పెద్ద బవంతి కలదు.

చారుదత్తుఁడు పెత్తనమునకు వచ్చుసరికి ఆయింటి వైభోగము నేలయంటెను. ఆతఁడు సహజ ధార్మికుఁడు; పరోపకార ప్రవణుఁడు. శరణాగతవత్సలుఁడు. దీనజనబాంధవుఁడు. పూర్వులు గడించి యిచ్చిన మేడలు మిద్దెలు తోఁటలు దొడ్డులు ధనకనకవస్తువాహనాదులు చారుదత్తుని చేతిలో అలంతి కాలమునకే హారతికర్పూరమువోలె హరించుకొనిపోయెను. బ్రాహ్మణులు నిచ్చలు బంగారుపళ్ళెరములలో మృష్టాన్నములు కుడిచి బొజ్జలు పెంచుకొని వానియింటను కాలముపుత్తురు. ఆ బవంతిప్రోల బల్యన్నము కోసము

హంసములు సారసములు మందలు మందలుగా ముసురుకొను చుండును. పేదవడి వచ్చినవాఁ డెవ్వఁడేని వాని నడిగి హతాశుఁ డయి పోవుట ఉజ్జయినిలో లేనిమాట. ఇచ్ఛకములు నచ్చి అర్థిజనమున కిచ్చి తన్నుఁ దా మెచ్చుకొను విద్య ఆతఁ డెఱుఁగనే యెఱుఁగఁడు. కాసువీసములు చేతిలో కానవచ్చునందాఁక లేదు లేదనుమాట ఆతని కోశములో లేనేలేదు. మండు నెండలలో సమస్తజీవులకు తీర్థము ప్రసాదించి ఎండిపోయెడి యేఱువోలె దానరాధేయుఁడు చారుదత్తుఁడు భాగ్యము సన్నగిల్లి నానాఁటికి ఎత్తువడి పోయెను.

కొమ్మకొమ్మకు పులుఁగు పులుంగుగ సర్వజీవులకు శరణ్యమైన మహీజము మొరడు కాఁగా – ఎక్కడి వక్కడ జీవు లెగిరిపోవుట లోకములోఁ జూతుము. మదజలధార లూఁచముట్టుగ ఉడిగినపిదప – ఏనుంగు సన్నిధిలో మెలంగవలెనని తేఁటిగములకు మనసు పుట్టదు. ప్రభువు దరిద్రుఁడై పోయిన ఆశ్రితులలో ఒక్కఁడును అందుపాటుగ కానరాఁడు.

చారుదత్తుని దారిద్ర్యమునానాఁటికి చవిచూచియు ఆతనిని సర్వదా ఎడఁబాయనివారు నల్వురే నల్వురు. ఒకతుక ధర్మచారిణి ధూతాంబ. వేఱొకర్తుక దాసి

రదనిక. ఒకఁడు సేవకుఁడు వర్ధమానకుఁడు. మిత్రుఁడు మైత్రేయుఁ డింకొకరుఁడు. దుర్భరదారిద్ర్యములో వానికి వారే సర్వోపరి వారము. ఆ గేస్తున కొక్కఁడే బిడ్డ. వానిపేరు రోహసేనుఁడు.

తన మిత్రుఁడు దారిద్ర్యము దాపరించి తల్లక్రిందు లయ్యెనే యని రేయుంబవలు మైత్రేయుఁడు వగచుచుండును. నిచ్చలు లాఁతివారి యిండ్లలో నిమంత్రణ భోజనములు కుడిచి అతఁడు కడుపుఁబని చూచుకొనుచు సాయంసమయమునకు గూఁడు చేరు పావురమువోలె చారుదత్తుని యింటికి చక్కఁగా సూటిగ వచ్చివేయును. ఆశ్రమము బ్రహ్మచర్యము. భోజనములో తుష్టి యెఱుఁగడు. హాస్యమన్న చెవి కోసికొనును. వట్టి నిద్రాప్రియుఁడు; పైఁగ— ముసలాగ్ర బుద్ధి. ధూతాంబ వెనుకటి కాలపు టిల్లాలు. శీలములో మగనికి లవ లేశము తగ్గిపోనేరదు. కాఁపురములో కాలు వెట్టిననాఁడు — ఆ యింటి భోగభాగ్యములకంతు లేదు. మగని గడన యుడిగెను గాన— అతఁడింక మానసీయుఁడు కాఁడనుట ఆమెకు రోఁత. అతఁడే ఎప్పుడును ఆమె కిలువేల్పు. అతఁడే సర్వప్రాణము. కలిమి లేదని వగవదు గాని — ఆ దశలో నాథునికి విచారము కలిగెనా తాను వగచును. అదియే—అనుకూల దాంపత్యఫలము. అది అందఱకు దక్కని మహాభాగ్యము.

ఆ నగరములో వసంతసేన యను వారవనిత ఒకర్తుక ఉండెను. రతీదేవినిం దెగడు సౌందర్యరాశికి ఆమె మచ్చుతునక యన వచ్చును. వెలయాలి వంశములో కలిగినను కులాంగనలలో సైతం మామెకు ఉద్ది యెవ్వరును లేరు. భవనమా కుబేరభవనము; వైభవమా దేవేంద్ర వైభవము. ఎనిమిది గుమ్మములతో గుమ్మము గుమ్మము నడుమ అనంతవిలాసములతో విశాల వేదికలతో పరిచారికా బృందములతో కళకళలాడుచు సందడి దండిం బెరయుచు కన్నుల ముచ్చటగా ఆ భవనము కానవచ్చును. కులవృత్తిలో మొనగత్తెయైన వసంతసేనా జనయిత్రి, ఆ కాలపు వెలయాండ్రలో తలమానికమై కాలుసేతుల ప్రోవుచేసిన అమూల్యకనకరాసులతో మేడలు మిద్దెలు కట్టించి ఊరిలో పేరుమోసెను. ఏనుంగు లెక్కియు - అందలంబు లెక్కియు ఉడుగరలు చేతంబట్టియు ఎందరెందరో సరసులు ఉజ్జయినిలో వచ్చి ఆమెగుమ్మము సమ్ముఖమ్మున రేయుంబవలు వ్రాలు చుందురు; పడిగాపులు పడుచుందురు. వయసులో సొగసు గలిగి ఆటపాటలలో ఆరితేఱి రసజ్ఞుల డెందములను వశీకరించు కొను నేరిమి ఆబిడకు వెన్నతోఁ బెట్టిన విద్య. లేక లేక చిరకాల మునకు అల్లారుబెల్లమై త్రిలోకసుందరియై కడుపునఁ బండిన ఆ

వసంతసేనమీఁదనే కన్నులు వెట్టుకొని అహోరాత్రములు ఆతల్లి ఏవో కలలు కనుచుండును.

ఆనాఁడు మాలవదేశమునకు అధీశ్వరుఁడు పాలకమహారాజు. పరిపాలనాచాతుర్యము రవ్వంతయు లేని వాని యేల్బడిలో ప్రజల కన్నియు కడగండ్లే. ఱేఁడు, ఎద్దు—ఈనె ననఁగా గాటఁ గట్టివేయుమనువాఁడైనచో ఆ సొగసు వేఱుగ చెప్పవలెనా? ఉద్యోగులు పెట్టినదే భిక్ష. ప్రజలను మన్నించు నాథుఁడే లేఁడు. సిస్తుదస్తులు చెల్లక కూడుగుడ్డలు దొరకక నా యనువారు కానరాక వస్తులతో గాసిఁబడుచు వడరానిపాటులలో ప్రజలు మునిఁగి తేలుచుండిరి. ఈ యిక్కట్టులకుఁ దోడు మఱొక్క చిక్కు వచ్చిపడెను.

రాజునకు పట్టపురాణియే గాక ఉంపుడుఁగత్తె యొక్కతె ప్రియురాలు కలదు. ఆబిడ కొక తమ్ముఁడు. వానిపేరు శకారుఁడు. అసలే వాఁడు క్రోఁతి; పైగా— రాజస్యాలకుఁడనన్న ధీమా!! దానికి తోడు ఱేఁడు మెచ్చి రాష్ట్రీయాధికారము వానిచేతిలో కట్టపెట్టెను. ఇఁక వాని వైభోగము చెప్పవలెనా? వానికి బాలాగ్రమను పెద్ద మేడలో విడిది. పుష్పకరండకమను పూలతోఁటలో మజిలీ. నటవిటచేటపరివృతుండై నగర మెల్ల తిరిగివచ్చుట వానికి

రివాజు. దేశములో సమస్తము తన చేయున్న భావన. వానికి కోరిక పొడమెనా అప్పుడే తీఱిపోవలె. కాదు, కూడదనుటకు గుండె గలవా రెవ్వరును లేరు. అబ్బాయి కోరికి ఇదియని అమ్మగారే జననితో విన్నవించును. అబ్బరమే రాజముద్రాల హాజరగును. తీర్పులలో - ఆలస్యమే ఆయెనా అప్పుడే చెప్పితీరును. ఇంక నా బ్రహ్మాస్త్రమునకు తిరుగే లేదు. వానిపేరు చెప్పినఁ జాలు - అధికారులకే అడలు. వాఁడు నిల్చబెట్టిన యిల్లు - ఫిర్యాదియు లేదుగాని కూల్చిన కొంపలు కోటానఁగోటులు. రాజ్యములో వానిమాటకు ఎదురే లేదు. రాజుమాట మఱచి ఈ కీచకునే పదిమందియు బూచిగాఁ జూచి భయపడుచుందురు. అందచందములలో తాను అందెవేసిన చేయి యని నిచ్చలు ఉబ్బి తబ్బిబ్బులయి కూనిరాగములు తీయును; లిల్లాయిపాటలు పాడును. చక్కని చుక్కలు ఎదురైనచో - తన్నే కామింతురని వాని దీటు.

వసంతసేన నెయ్యమునకు ఎందఱెందఱో గ్రుక్కిళ్ళు మ్రింగుచుందురు. ఆబిడ వైఖరియే వేఱు. వంశమర్యాదకే విచ్ఛిత్తి వచ్చునని ఆమెతల్లి పసివట్టెను. చల్లగా మెల్లగా దరిచేరి తల్లి యా పిల్లవద్ద రాజాధిరాజుల వైభవములు చెప్పి ఖులిపించును; ఏవేవియో బోధించును.

కాలమునాఁటి కథలు విప్పిచెప్పెను. బిడ్డ ససేమిరా యనును. సిగ్గు గల వెలకాంతకు చేటు మూఁడునే యమ్మా యని అమ్మ మొత్తుకొనును. రాజస్యాలకుని పేరుసైత మెత్తి మురిపించెను. ఛీ యని కూఁతురు విసిరికొట్టును. తల్లి బెంగకు అంతు లేదు; అసలే మూఁడుకాళ్ళ ముదుసలి. చిత్తము స్వాయత్తము కాదు. ఒంటినిండుగ బంకేఁడు జబ్బులు. లేవలేదు; కదలలేదు. దేహము స్థౌల్యమూ చెప్పఁబని లేదు. దగ్గఱకు పిలుచుకొనును. బతిమాలును; భంగపడును. అదలించును. బెదరించును. ఎన్ని పాట్లు పడినను — తన కడుపున తప్పఁబుట్టిన ఆ బిడ్డవలన తన కిఁక లాభము లేదని గట్టిగాఁ దోఁచెను. పైఁగా— ఒక బెంగ. ఊరిలో దరిద్రులలోదరిద్రుఁడని పేరుమోసిన చారుదత్తుఁడే తన వలపుకాఁడని కూఁతురు చెప్పివేసెను. ఈ యింటిలో— ఈ కథ యిట్టులుండ, శకారుఁ డెట్లో పసివట్టి కుందనమువంటి వసంతసేనకై దారులు కాచుకొని దోఁచుకొన వేచియుండెను.

వసంతసేన తన్నే వలచినదన్న వార్త చారుదత్తునకు తెలియును. నిర్ధనుఁడైన తన్ను కామించినదానికి ఆతఁడు మతిలో కృతజ్ఞత చూపుకొనును. అయాచితముగా దక్కిన ఆ సౌందర్యరాశికి మిక్కిలిగా మురిపము పొంది వలపుపాలపును ప్రోదిచేసికొనును. కాని తాను దరి

ద్రుఁడనే యన్న బెంగ నిలువున క్రుంగఁ దీయును. అద్దాన నాతఁడు—ఆ వలపును బయల సుబ్బనీయఁడు. ఆతని వర్తమాన స్థితికి క్రుంగి బెంగపడినఁ చూర్ణవృద్ధుఁడను నేస్తగాఁ డొకఁడు మైత్రేయునిచేతి కిచ్చి ఉత్తరీయ మొకటి పంపెను. జాతీకుసుమ వాసనలచే గుబాళించు ఆ వస్తువునుజూచి తన తొల్లింటి మహో దశ మదిలో మెదలఁగా చారుదత్తుఁడు దిగులువడును. అంతలోఁ దెప్పిఱిల్లి నిత్యకృత్యములుకొంత రవంతయు రానీయక కాలము గడపుచుండును.

ఒకనాఁడు చారుదత్తుఁడు సందె ప్రొద్దున కాల్యకరణీయము లొనర్చి వైశ్వదేవాదికములు యథా విధిగఁ దీరిచి గ్రామదేవతలకు బలివేయుమని బల్యన్నమును మైత్రేయునిచేతి కిచ్చెను. ఎన్నాళ్ళు శ్రమపడి నిత్యకృత్య ములుగా చేసికొని ఏ వేల్పునకు ఎంత మ్రొక్కినను నీమీఁద దయ చూపనినాఁడు—ఈ బలిదానము లేలయని ఆ మిత్రుఁడు విసిగికొనెను. అది కాదని నచ్చఁజెప్పి చారుదత్తుఁడు గార్హస్థ్య విధిని బోధించెను. అంతలో మైత్రేయుఁడు బుద్ధి మఱలి, మిత్రమా! మనరోజులు మంచివి కావు. పైఁగా నావంటి బాఁపఁడు ఏది చేసినను ప్రొద్దు ఎదురే. చీఁకటి పడ్డది. అనే కులు దుర్విటులు వీధిలో తిరుగుచుందురు. నాకు భయము

వేయుచున్నది. అని అంకిలి పెట్టెను. సరే! దానికేమి యని దాసీవనితను రదనికను చారుదత్తుఁడు పిలిచి వానికిఁ దోడుఁగాఁ జేసి యిచ్చి పంపెను.

నిజముగా — ఆ సంజ చీఁకటిలో శకారుని పరివారము సికారు బయలుదేఱెను. రాజమార్గమున విటులయు చేటులయు సంచారమే హెచ్చు. అదే సమయములో వసంతసేనయు — చల్లగాలికై కదలి అదే వీథికి వచ్చెను. శకారుఁ డెట్లో ఆవిడజాడ పసిపట్టి మెల్లమెల్లగా వెంట నంటెను. ప్రేమగాథలు బయటపెట్టెను. మోహాంబుధిలో మునింగిపోయి మనోరథ మీడేర్పవా యని వేఁడుకొనెను. ఛీఛీ యని వసంతసేన ఈసడించి ఆతని దూరీకరించి ఎడముగా నడువసాగెను. నయానఁ జూచిన పని కాదని ఆ ధూర్తునకుఁ దోఁచెను. వాని పరివార మాతనితో మూవురు. ఆ వెంట — ఒకఁడు వెనుక; మఱొక్కఁడు ముందు. ముందున్నవాఁడు ముదుసలి. నడిమివాఁడు కథానాయకుఁడు. బెబ్బులిదాడికి లేడి వడువున గడగడ వడంకుచు — అడుగులు తడఁబడుచుండఁగా బెదరుచూపులు పఱపుచు వడివడిగా ఆ వడుచుకొంత పరువు లిడుచుండెను. శకారుని నానావికారములకు అంతే లేదు. వెఱ్ఱికూఁతలు; లిల్లాయిపాటలు. వట్టి ప్రలాపములు—ఒకటే గొడవ.

సందర్భము లేని పురాణగాథలు త్రవ్వును; వీరాలాపములు వినిపించును. ఇదిగో! నాదెబ్బ యని మీసము మెలివేయును. చీఁకటిలో చిందులు త్రొక్కును. తలయు-తోఁకయు లేని చాటువులు. వట్టి బిభీషికలు. వానిగంతులకు అంతులకు వసంతసేన బెదరిపోయి దిక్కుతోఁపక పరువులు వాఱుచు విలాప మొనర్చెను. ఈ సందడిలో దండడిలో ఆమె పరిచారికలు త్రోవ తప్పిపోయిరి. ఒంటరిగత్తె; సందెచీకటి. ఆపన్నురాలయిన ఆఁడుది. సర్వభయంకరుండైన ఆ పాపాత్ముని దాడికి ఆ యబల యేమి సేయఁగలదు? వీథిలో రివ్వురివ్వన ప్రక్క-ప్రక్క-గా ఉఱుకుచున్నది. గుడ్డిలో మెల్ల యన్నట్లు సరిగా అందఱు చారుదత్తుని వీథికే మరలిరి. చారుదత్తుఁడే ఆమెకు వలపుకాఁడని శకారుఁడెఱుంగును. దానివల్ల చారుదత్తుని మాట యెత్తిన ఆతనికి వల్లమాలిన కోపము. అదే జ్ఞప్తికి వచ్చి, ఓహోహోయి బావా! ఛారుదత్తుని కొంప అదిగో! మన కెడమచేతివైపుగా నున్నది. ఈబిడ తప్పించుకొని తూఱునేమో! జాగ్రత్తసుమా! యని అనరాని మాట కేకవేసి మఱి వినిపించెను. ఆ పరివారమునకు - ఈమె యన్నచో మంచిభావమే కద్దు. పైఁగా - చారుదత్తుని వలచిన దన్నమాటకు వారే సంతోషపడిరి. ఉపాయముగా దారి యిచ్చిరి. అదే వీలుగాఁ జూచుకొని వసంతసేన సరిగా ఆ గుమ్మము మ్రోలకేచేరుకొనెను.

రదనిక కరదీపిక చేతఁబట్టి అదే సమయములో తలుపు తెఱచెను. అదాటుగ వచ్చిన ఆ వెలుఁగునకు సైఁపలేక వసంతసేన, దబ్బాటుగ దానిని కొంగుతో నార్పివైచి రివ్వున లోనికిఁ దూఱెను. గాలిపాటున దీపము పోయెనని మైత్రేయునకుఁ దోఁచి వెలిఁగించి తెచ్చుటకై లోనికిఁ బోయెను. ఇంతలో ముంగిట నున్న రదనికయే వసంత సేన యని భ్రమసెంది శకారుఁ డాబిడ కొప్పును పట్టనే పట్టెను. అమ్మో! బాబో! యని యాబిడ కావుకేకలు వెట్టి ఉక్కిరి బిక్కిరి యాయెను. సరససల్లాపములతో – అసందర్భ ప్రలాపములతో శకారుఁడు కేరింతలు కొట్టుచుండెను. పిల్లికి చెరలాటము – ఎలుకకు ప్రాణసంకటము. ఇంతలో దీపము పట్టుకొని మైత్రేయుఁ డక్కడకు రానేవచ్చెను. ఎవ్వరో దొంగలు! అయ్యో! నన్నుఁ బట్టుకొనిరి. ఓయమ్మో మొయ్యో యని బొమ్మబొమ్మ తెగబాఁదుకొని రదనిక యేడ్వసాగెను. మైత్రేయుఁడు బిత్తఱపోయి, వాఁడెవ్వఁడో కాఁడు మమా! రాష్ట్రియుఁడగు శకారుఁడే వాఁడని గుఱుతు పట్టి గుండెలు కొట్టుకొని పండ్లబిగువుగా నిలిచి, పైకి బూటారముగా నిన్నేమి చేసెదనో చూడుమని దామదూములు చేసెను. శకారుని బంటు జంబుకుఁడు మాత్రము మైత్రేయుని కాళ్ళమీఁదఁ బడి, ఎవరో యనుకొని ఈమెజోలికి వచ్చితిమి. తప్పంతయు

మాటే. ఈ వార్త చారుదత్తుని చెవిలో వేయవద్దుసుమా! యని బతిమాలెను. శకారున కది గిట్టలేదు. పైగా - ఆబిడ ఆతని యిల్లే దూరెనా? దానికి మఱింత మండిపడి వ్రేలు చూపి - ఇట్లని హెచ్చరించెను:—ఓరీ బ్రహ్మిగా! నే నెవ్వఁడనో తెలియునటరా? రాజస్యాలకుఁడను; దండపాలకుఁడను; అనఁగా శకారుఁడను జాగ్రత్తసుమా! నేను ప్రేమించి కావలెననుకొన్న కాంత వసంతసేన యను భోగముది మీ దరిద్ర చారుదత్తుని వరించినది. ఇప్పుడు నన్నుఁ గాదని త్రోసివైచి వానియింటనే తూఱినది. ఇంతకు - ఆతఁడు స్వయముగా ఆబిడను దెచ్చి నాచేతిలో పెట్టనిచో తరువాత అనుకొన్న లాభము లేదు; వ్యవహారము ముదిరిపోవును. అధికారులతో చెలగాటము అపాయకరముసుమా! ఇప్పుడుగాని ఆతఁడు దారికి వచ్చెనా ఆతని నేనేమియు అనను. లేదా! ఇదే నా శపథము వినుము. యావజ్జీవము నాకును వానికిని కయ్యము ఖాయము. నీ మిత్రునకు - ఈ మాటలు చెప్పి వాఁడేమనునో దానినీ నా మేడకువచ్చి మఱి చెప్పుకొనుము.

పదపడి ఎవరిత్రోవను వారు పోయిరి :— బలికార్యము ముగించుకొని అప్పుడే వీరు వచ్చిరేయని తలంచి రదనికా! పిల్లవానికి రోహసేనునికి దీనిని గప్పి

రమ్మని ఆ వసంతసేనచేతిలోనికి చారుదత్తుఁడు ఉత్తరీయము విసిరివేసెను. జాజిపువ్వుల వాసనలు గుబాళించు దానిని కనకముగా ఆబిడ కేలఁ గైకొని కన్నుల కద్దుకొని, ఈ దశలో సైతము ఈ విలువగల వలువలా! యని అబ్బుర మందుచు ఉబ్బిపోవుచు - ఏవేవియో తలపోయుచు అట్లే పోయి పిల్లవానికి కప్పివచ్చి అక్కడనే నిలిచి యుండెను. ఇంతలో వారిర్వురును రానేవచ్చిరి. ఈమె రదనిక కాదాయని చారుదత్తుఁడు నివ్వెఱపోయి ఎగాదిగఁ జూచెను. పరకళత్రమేమో యని పరకాయించెను. అప్పుడు మైత్రేయుఁడు జోక్యము తీసికొని, ఎవ్వరో కాదు మిత్రమా! ఈమె వసంతసేనయే. ఇక్కడ జరిగిన గొడవ పెద్దది. ఆ పాపాత్ముఁడు శకారుఁడు నట్టనడు వీధిని ఈమెను బట్టుకొనఁబోయెను. ఈమె వానికిఁ జిక్కలేదఁట. హైఁగా నీవద్దకే పరువులు త్రోలి వచ్చెనఁట. దానికి కనకన మండి ఆ నీచుఁ డిట్లు నాతో కబురు చెప్పినాఁడు. ఏమని! ఇదిగో! మీ చారుదత్తునకు ఈ మాట చెప్పుము. నిన్నె మనః పూర్వకముగా వలచి వచ్చిన కాంతను బలిమిని బంధింపవలె నని దూఁకితిని. ససేమిరా యన్నది. వెంటనే నీవైన ఆబిడను నావద్దకు పంపవలెను. ఇత్యాదిగ-అన్ని యంశములు పూస గ్రుచ్చినట్టులు మైత్రేయుఁడు వినిపించెను. ఆ మాటలలో

అచ్చముగా ముచ్చటగొలుపు వలపువార్తలకు వసంతసేన మురిసిపోయి ధన్యురాలనని తలంచెను.

అయ్యో! పొరపాటే జరిగినది. దాసియని నిన్నుఁ దలంచి పనిసైతము చెప్పితినే! తప్పు సైరింపుమా! యని చారుదత్తుఁడు వసంతసేనను గోరెను. లేదు - లేదు ; తప్పు కాదు. దాసిగా మీరు నన్ను భావించుటయే నా మహాభాగ్యము. దానికోసమే రేయుంబవలు తపస్సు చేయుచున్నదాన. ఈదాసి మీ యింట నేఁడు - అపవిత్ర దోషము కలిగించినందులకు మీరే మన్నింపవలసి యున్నది. అని యామె వాని యడుగుఁదమ్ములలో వ్రాలెను.

సరసాలాపములు విలాస గోష్ఠులు అచ్చటగా ముచ్చటగా నిర్వ్యార నడుమను నడచినవి. ప్రొద్దు పోయెను. ఆ రేయి అక్కడనే నిలిచిపోవలె నని వసంతసేన మదిలో కలదుగాని విప్పి చెప్పదాయె. ఉండి - రేపు పొమ్మనుటకు చారుదత్తునికి సైతము గుండె చాలదాయె. ఊరంతయు మాఁటు మణఁగె. జార చోరులు దారిలో జోరుగ తిరుగువేళ ఆయెను. మిత్రమా! ఈమెను బంపి వత్తువా? యని చారుదత్తుఁడు మైత్రేయు నడిగెను. రాజహంసవోలె తగియుందువు నీవే పోయి రమ్మని మిత్రుఁడు మేలములాడెను.

సరే! దీపము తెమ్మని కేక వేయఁబోయి చమురు లేదని చటుక్కునఁ దెలిసి గుట్టుగ చారుదత్తుఁ డూరకుండెను.

ఎందులకైనను మంచిది. ఇది యొక దొడ్డ ఆభరణము. దీనిపేరు సువర్ణభాండము. దారిలో తప్పక దొంగ లుందురు. దీనిని మీ యింటనే దాఁచిపెట్టుఁడు. తక్కిన నగలమాట యెత్తను. అని యొకనగ తీసి చారుదత్తుని చేతి కిచ్చి వసంతసేన పైన మాయెను. దానిని దాఁచిపెట్టు టలో నిర్వురును వంతులు వైచికొని, తోడుతోడుగా నిద్ద ఱును బయలుదేఱి ఆమె యింటికి ఆమెను భద్రముగా — పంపి వచ్చిరి.

ఆ రేయి – ఆమెకు నిదురయే లేదు. చారుదత్తుని సౌజన్యమును సౌందర్యమును మెచ్చుకొనును; ఏవేవియో తలపోయును. అట్లే బళ్ళున తెల్లవారెను. కాల్యకరణీయములు తీర్చికొని అనుంగుఁజెలి యగు మదనికతో ఆ ముచ్చటలే తెచ్చును; ఏవో మెచ్చులు పలుకుచు నిమేష మొక యుగముగా కాలము పుచ్చుచుండును.

చారుదత్తుఁడు పచ్చపచ్చగా నున్నరోజులలో ఉజ్జయినీనగరములో అందఱు నాతని సొమ్ము తిన్నవారే. అందులో సంవాహకుం డొకఁడు. ఈతఁ డేదో ప్రక్కయూరివాఁడు. చదువు సంధ్యలు లేక అదుపునాజ్ఞలలో తిరుగక అడ్డమైన సావాసము చేసి జూదనాదములలో మెలఁగి కూటికి గుడ్డకు కఱవై ఉజ్జయిని చేరెను. చారుదత్తునియింటిలో కొలువు కుదిరిన పిదప కొంత హాయి చేకూరెను. అంతకు ముందటి పేరేమియో గాని సంవాహకవృత్తిలో చొచ్చినది మొదలు సంవాహకుఁ డను పేరు వచ్చెను. కొన్నాళ్ళకు వైభవ ముడిగి యజమానుఁడు చారుదత్తుఁ డిట్లాయెను. అక్కడ

పొట్టకు గిట్టక అది వదలుకొని ఊరిలో అల్లరి చిల్లరి సంఘముతో నేస్తము గట్టెను. ప్రాఁతవిద్యలో జూదములో బాహాటముగా చొఱఁబడి క్రిందయు మీఁదయు తుదికొక ఆపదలోఁ జిక్కుకొనెను.

ఒకనాఁటి యాటలో - ఆతఁ డోడిపోయి అప్పు తీర్పను జేతఁగాక దెబ్బలు తినవలసివచ్చెను. తోఁడేళ్ళవంటి యిర్వురు జూదరులు వెంటఁబడిరి. వారిని దప్పించుకొని వీఁడు అక్కడనే ఒక పాడుగుడిలోఁ దూఱి అమ్మవారి పీఠము నధిష్ఠించి చిత్తరువుగా నిలిచిపోయెను. తఱుముకొని యిర్వురు లోనికి వచ్చిరే గాని ఆ చీఁకటిలో వానిని గుర్తింపలేక అమ్మవారి విగ్రహమే అనుకొని హతాశులై అక్కడనే పాచికలు పట్టి తిప్పవెచిరి. ఆ సందడిలో దుర్వ్యసనవాసనావాసితమానసుఁ డగు సంవాహకుఁడు మతి దప్పి ఎగిరి దూఁకి ఆటలో చేయి గలిపెను. దొరకెరా దొంగల కొడుకని ఆ యిద్దఱు సంబరపడి వానిని బట్టి చావఁజిదుకఁ గొట్టిరి; బాఁదిరి; పొడిచిరి; అదలించిరి. బెదరించిరి. కాని, వాని చేతిలో ఒక కానియు లేదుగదా!

అప్పుడు త్రోవను బోవుచు ప్రాఁతజూదరి దర్దురకుఁ డను వాఁడు సంవాహకుని యేడ్పు విని

దగ్గఱకు వచ్చి చూచెను. వ్యవహారము చక్కఁబడుటకై ఎన్నో యెత్తులు వైచెను. సంవాహకుని పక్షము సేరి వివాదము పెంచెను. పలువురు ప్రోవయిరి. కోలాహలము పెరిఁగెను. మాటలు బెడిసి వారిలో నొక్కఁడు సంవాహకుని ముక్కు మీఁద బలముగా గుద్దు గుద్దెను. దానితో ముక్కు బెదరి నెత్తురు లోఁకికలు గట్టె. ఇంతలో దర్దురకుండు మండిపడి జోక్యము తీసికొని తానే వాండ్రతో కలియఁబడి సంవాహకుని పాఱిపొమ్మని సైఁగచేసి గుప్పెఁడు ఇసుక తీసికొని ఆ కొట్టిన వాని కన్నులలోఁ జిమ్మెను. వాఁడును గళవళపడి యెట్టెటో తెప్పిఱిల్లి, దురాత్మా! ఇదిగో! చూడు నా దెబ్బ. రాజస్యాలకునితోఁ జెప్పి పాలకమహారాజు సన్నిధిని నిన్నేమి చేయించెదనో! అక్కఱమాలిన జోలి నీ కెందులకో! అని బెదరించెను. పోరా! పాలకమహారాజు బ్రదు కెంత! నీ బ్రతు కెంత? ఆర్యకమహారాజు వచ్చునులే జాగ్రత్త!! అప్పుడు నిన్నేమి చేయింతునో చూతువుగాని—అని రుసరుసలాడి వడి దొలఁగిపోయెను.

సంవాహకుఁడు వచ్చినంత పనియై త్రోవ యంతయు నెత్తురులు చిమ్ముచు పరువులు త్రోలుచు వసంతసేన వాకిటికి వచ్చి తటాలున తలుపు నెట్టి

అమ్మా! నన్ను రక్షింపవా యని ఆమెను శరణు వేఁడెను. ముందు తలుపు వేయించి, ఎవరవయ్యా! నీ వని ఆమె గ్రుచ్చి గ్రుచ్చి యడిగెను. చారుదత్తుని సేవకుఁ డని తెలిపోయెను. ఆయన పేదఱికముచే తన కీ తిప్పలు వచ్చిన వనియు జూదములో ఓడిపోయి దెబ్బలు తింటిననియు—అప్పులవాండ్రు వెంటఁబడి తఱుముకొని వచ్చుచున్నారనియు ఆ యేడ్పులోనే అతఁడు విన్నవించుకొనెను.

చారుదత్తుని పేరు — ఎత్తినందులకు సంతోషపడి ద్రవ్యసంబంధమే గదా! అని ఆమె నిబ్బరించి దాసిని బిలిచి, ఇదిగో! ఈ మురుగు తీసికొని వెళ్ళి తలవాకిట అఱచుచున్నవారికి సంవాహకుఁ డిచ్చెనని చెప్పి యిచ్చి రమ్మని ఆజ్ఞాపించెను. సరే — నాఁటి కా బెడద తీరిపోయెను.

అమ్మా! నీ ఋణ మెట్లు తీర్చుకొందునో యని సంవాహకుఁడు వసంతసేన కాళ్ళమీఁదఁ బడి వేయువిధాల వేఁడుకొనెను. ఆతని లేవనెత్తి వసంతసేన లెస్సగా ఊఱడించి, నీ జీవికమాట యేమి? నీ పూర్వ యజమానుని కొలువులోనే ఉండరాదా! జీతము కావలసినంత నేనే యిచ్చుచుందును. అని సముదాయించెను. అమ్మా! జీతము లేకయే కొలుతునని ఆ మహానుభావుని వ్రేల నే నెంతో మొత్తు

కొంటిని. ఆయన ఒప్పుకోఁడయ్యె. ఆ పుణ్యాత్ముని సేవా భాగ్యము నాకు దక్కదు తల్లీ! ఇఁక నాకీ పాడులోకముతో పని లేదు. శాక్యభిక్షుకుఁడ నయ్యెద. ఎప్పుడేని అక్కఱ వచ్చి నేని ఈ బుద్ధశ్రమణకుని మాట మఱువవలదని ప్రార్థించి ముదల గైకొని పోయి అప్పుడే ఆశ్రమస్వీకారము చేసెను.

ఊరిలో వెఱ్ఱియేనుఁగొకటి అడ్డు మాఁకయు లేక వీధిని బడి తిరుగుచుండెను. ఎవరి సందడిలో వారుండిరి. పిల్లలు తల్లులు - ఎల్లరు గొల్లు మనిరి. పరుగు పరుగున ప్రజలు - ఇండ్లలోఁ దూఱుచుండిరి. పాడుగోడలు దాఁటి చెట్లకొమ్మలకెక్కి ఎవరికి వారు తప్పించుకొని పోయిరి. వీధిలో - ఒక్క పురుగు లేదు. ఆజంతువు కోటలోనిదఁట. అప్పుడే పిచ్చియెక్కి ఊరిమీఁదఁ బడినది. రాజమార్గము దాఁటి కోమటివీధికి వచ్చెను. తెగిపోయిన యినుపగొలుసులు కాళ్ళకంటుకొని వ్రేలాడుచుండెను. కోమట్ల పిల్లలందఱు గగ్గోలు వెట్టి కోడిపిల్లలు తల్లిగూఁటిలోఁ దూఱినట్లు - ఇంటిలోఁ దూఱి తలుపులు వేసికొనిరి. చారుదత్తునిబిడ్డ రోహసేనుఁడు వీధిలో - ఆడుకొనుచు మొగమెత్తి పాఱఁజూచెను. ఇంతలో నడగొండవంటి ఆ మదపుటేనుఁగు తొండము నాడించుచు పెద్ద పెద్ద అంగలు వైచుచు అక్కడికే నడువసాగెను. అయ్యో! పిల్లవాఁడు

పిల్లవాఁడని మేడలమీఁద మిద్దెలమీఁద గుట్టలు వడి గుండెలు బాఁదుకొనుచు స్త్రీలును బురుషులును గొల్లుమనిరి. అది విని పిల్లవాని తల్లి ధూతాంబ గుమ్మమువద్దకు వచ్చి అక్కడనే కూలఁబడిపోయెను. ఆమెవెంట నురుగులు గ్రక్కుచు వచ్చి వచ్చి రదనిక ఆదృశ్యము చూడఁజాలక అమ్మో! యని ఱొమ్ము గ్రుమ్ముకొని ఏడువసాగెను. సమయమునకు చారుదత్తుఁడు సైత మచ్చటికే వచ్చి హా దైవమా! యని అఱచి కొయ్యఁబాఱి నిలిచిపోయెను.

ఇంతలో బౌద్ధసన్న్యాసి యొక్కఁడు చెట్టుమీఁదనుండి దూఁకి, పిల్లవానిమీఁదికిఁ బోవు ఏనుఁగును తోఁకఁ బట్టి లాగి వెనుకకు త్రిప్పెను. ఆతనిని వదలి ఈతని దెసకు – ఆగ్రహోదగ్రమై ఆయేనుఁగు వచ్చుచుండఁగా – ఒక్క బలశాలి బలమైన అంకుశము చేతఁబట్టి ఉపాయముగా దాని మొగముమీఁద సత్తువకొలఁది మొత్తి అంకెకుఁ దెచ్చెను. ఎవరా! మహానీయుఁడని అందఱు మూఁగిరి; కైవారము చేసిరి. చారుదత్తుఁడు పొంగిపోయి రివ్వురివ్వున వచ్చి బహూకృతి చేయఁదలంచి ఒడలు చూచుకొనెనే గాని ఒక్క నగయు లేదాయె. అయ్యో! యని నిర్విణ్ణుఁ డయి తాను గప్పుకొన్న ఉత్తరీయమును వెంటనే వానిమీఁదఁ గప్పెను. సన్న్యాసికి

మ్రొక్కవలె నని అటునిటు చూచెనేగాని వాని జాడయే కానరాదాయె.

ఆ బలశాలి పేరు కర్ణపూరకుఁడఁట. వాఁడు వసంతసేన మావటీఁడఁట. ఆతఁడు – నలికసాని మ్రోలకు రివ్వునఁ బోయి – ఈ జరిగినదంతయు విన్నవించి ఉత్తరీయము చూపెను. కన్నులపండువు సేయు ఆ యుత్తరీయమును వసంతసేన గైకొని వానిని మెచ్చుకొని నూఱు బంగారు నాణెములు బహూకృతిచేసి వాని కానందము కలిగించి సెలవొసంగి పంపి తాను దన వలపుగాథలో మునిఁగిపోయెను.

# మూఁడవ ప్రకరణము

ఉజ్జయినిపట్టణములో గానవిద్యాఘట్టమున రేభిలుని మించిన చేయి లేనేలేదు. ఆతఁడావిద్యలో ఒజ్జలకు నొజ్జ. అచ్చముగా శారదాపీఠమే యనవచ్చును. ఆతఁడు వీణ వాయించుతఱి ప్రకృతి యంతయు నిస్తరంగజలధివోలె స్తబ్ధమై ముగ్ధమై సన్నిధిలో ఒదిగియుండును. ఏఁటేఁట గణపతినవరాత్రములకు రేభిలుఁడు పాటకచ్చేరి పెట్టును. ఆ పాట వినుటకై ఆ యూరిలో పోవని ఉత్సాహపడని రసికులు లేనేలేరు. ఆ యిల్లు — అన్నాళ్ళు తిరునాళ్ళుగా తీర్థప్రజలవంటి శ్రోతలచే — ఇసుక వైచిన రాలకుండ క్రిక్కిఱిసిపోవును.

చారుదత్తునకు రేభిలుఁడు సన్నిహితమిత్త్రుఁడు. ఈతని సంగీతమన్న — ఆతఁడు చెవి కోసికొనును. ఒకనాఁటి పాటకచ్చేరికి నెచ్చెలికానిని వెంట వైచికొని చారుదత్తుఁడు వెళ్ళెను. జంత్రగాత్రములు మేళవించి — ఆనాఁడు పాడినపాటకు గంధర్వులే క్రిందికి దిగివచ్చిరి. ఱాలు నీరుగా కరఁగిపోయె. మ్రోళ్ళు చిగురులు వెట్టె.

కచ్చేరి ముగిసిన పిదప బ్రాహ్మ
ణోత్తము చారుదత్తుడు మైత్రేయుడు - ఇంటికి వచ్చిరి. సంగీతపు గంధమే లేని మైత్రేయున కయ్యది ఏదో గోడుగా దోచెనే గాని చారుదత్తుం డా ప్రస్తావము విడువం డాయె. ఒకటే ఆలాపన. అవే ముచ్చటలు. రేభిలునిగూర్చి పొగడ్తలు. నిద్ర వేళ ఆయెను. చందురుడు సైతము సంచారము మానివైచెను. రచ్చక్రంతలలో రాచబాటలలో ఒక్క పురువును మెదలదాయె. కుక్కలుగూడ గుఱకలలో దిగి ఒడలు మఱచి ఒదిగి యుండెను.

ఇంటిలో నిర్వారును బరుండి సువర్ణభాండము మాట యెత్తిరి. అబ్బా! యిది ఎక్కడ దాపరించెనయ్యా! బొత్తిగా కన్ను కూరకనీయదు. ఎవరో దొంగలు వచ్చిపడినట్లే ఏదేదో కడుపులో మెలివేయుచుండును. అని మైత్రేయుడు విసుగుకొనెను. సరేయని తుదికి దానిని దగ్గఱనే పెట్టుకొని అంతలో గుఱ్ఱువెట్టి అమోఘమయ జీవి యయ్యె. చారుదత్తుడు సైతము సంగీతసారస్యమునే మనస్సులో నెమరువేయుచు మెల్లమెల్లగా నిద్రాదేవి యొడిలో చేరుకొనెను.

ఆ యూరిలో శర్విలకుడని బ్రాహ్మణుం డొక్కరుడు కలడు. వసంతసేనదాసి యగు

**మదనికను** - అతఁడు ప్రేమించెనే కాని ధనము లేనిదే వెలకాంత దగ్గఱకు రానీయదు గదా! అతఁడా పట్టి దరిద్రుఁడు. ప్రజ్ఞా పాటవములో మాత్రము చేయి తిరిగిన మేటి. ఏదో రీతిని సొమ్ము గడించి ఎట్లో ఆబిడ దాస్యము పోఁద్రోచి తనదాని నిగాఁ జేసికోవలెనని తహతహలాడును. శాస్త్రము చదివిన వాఁడే గాని వలపు కైపుచే త్రోవ తొలఁగిపోయెను. పోనీ చౌర్యమే యేల చేయరాదు? అందులో ధర్మము లేదా! దారి లేదా! శాస్త్రము లేదా! అని యాతఁడు తుదికి నిర్ధరించి సాంగోపాంగముగ చోరశాస్త్ర మెల్ల ఆకళింతకుఁ దెచ్చుకొని ఆ యుద్యమములో చొచ్చెను.

నడిరేయి అయినది. ఆకాశమున మబ్బులు పట్టి చుక్కలే కానరావయ్యె. వీథులలో రక్షక వర్గము స్రుక్కియు సోలియు ఆదమఱచి ఏదో మైకములోఁ బడిరి. అప్పుడు శర్విలకుఁడు గజదొంగగా వెడలి చారుదత్తుని యింటికే ఎసరు వెట్టెను. ఇదేదో పెద్ద బవంతిగాన - కూలి గిట్టకపోవునా యని ఆ క్రొత్త బిచ్చగాఁడు ఎంచి శాస్త్రము ప్రకారమే కన్నము వైచెను. కనకశక్తి వ్రాసిన గ్రంథము చెప్పినట్లే ఆకన్నము త్రవ్వి లోనికి తొంగిచూచెను. లోపల మినుకుమినుకు మని దీపము వెలుఁగుచుండెను. అంతటి

యింటిలో నున్నది ఇర్వురే పురుషులు. వారును నిద్రలో మైమఱచిరి. తలుపు చప్పుడు కానీయక ఉతక యెత్తి లోపల కాలు వెట్టెను. నాల్గు మూలలు పరకాయించి చూచెను. ఆ ప్రక్క వీణె; ఈప్రక్క తంబురా, ఆవల మద్దెల; ఈవల తాళములు. అయ్యో! మోసపోయితినే యని శర్విలకుఁడు ఔడుగఱచెను. నేలలో సొమ్ము దాఁచిరేమోయని – అదియును దేల్చుకొనెను. ఛీ! వట్టి నిఱుపేద కొంపరా యని ఆ క్రొత్తదొంగకుఁ దోఁచి వెంటనే వెనుకచూపు పడెను. మిత్రమా! దొంగ దొంగయని మైత్రేయుఁడు కలవరించెను. పొందికగా గోడ కంటుకొని నిదానముగా పాఱఁజూచి ఆ దొంగ లోలోన నవ్వుకొనుచు ముందునకు నడువసాగెను. ఇదిగో! సువర్ణభాండము పుచ్చుకొనవయ్యా స్వామి! యని వెండియు నా విప్రుఁడు నిద్రలో కూయసాగెను. దొంగ నిదానించి ఆ దీపమును మెల్లగ ఆర్పివైచి వానిదగ్గఱకు చేరి చల్లఁగా చేయి చాఁపెను. ధగధగలాడు – ఆ నగను తీసికోవయ్యా మిత్రమా! యని అతఁడు దొంగచేతిలో పెట్టి ముట్టినదా యని యడిగెను. అవునని దొంగయు – ఊఁ కొట్టెను. అమ్మయ్యా! హాయిగా బ్రదుకుదు నని మైత్రేయుఁడు గుండెమీఁద చేయి వేసికొని నిద్రలో మునిఁగె.

పోయెను. శర్విలకుఁడు పట్టరాని సంతోషముతో దానిని జేతఁబట్టి ఉపాయముగా తప్పించుకొని యింటికిఁ జేరెను.

కనుచీఁకటి పోవక మునుపే

దాసి రదనిక పనికై వచ్చి అచ్చటి కన్నము చూచి అమ్మయ్యో! దొంగలు పడిరని పెద్ద కేకపెట్టెను. మిత్రు లిర్వురు మేలుకొనిరి. నవ్వులాటగా – అన్నదని చారుదత్తుని భావము. కన్నము చూపించిరి. అయ్యో! వీని కేమి దక్కును? పాపము! శ్రమపడినాఁడే యని మఱల చారుదత్తుడు విచార పడును. నాకు జోస్యము వచ్చును; దొంగలు మాఱెద రని యెఱిఁగియే అప్పుడు నీ చేతిలో ఆ నగను బెట్టి నా మాట దక్కించుకొంటిని గదా! యని ఆ విప్రుఁడు కోఁతలు కోసెను. అంతయు పరిహాసవిజల్పితమే యని చారుదత్తుఁ డెంచి, మిత్రమా! వసంతసేన యాభరణ మేది యని గట్టిగా అడిగెను. అయ్యో! నీ కిచ్చితిని గాదటయ్యా! యని మైత్రేయుఁడు మాఱువలికెను; సరే! దొంగకే అయ్యది దక్కెనని తేల్చుకొనిరి.

పెఱవారి సొమ్ము మనయింట

పోయెనన్న-మాట యేమి వచ్చునోగదా! యని బుద్ధిమంతుఁడు చారుదత్తుఁడు విచారములో మునిఁగిపోయెను. మిత్రమా! ఆ

నగ లెవ్వ రిచ్చిరి? ఎవ్వరు పుచ్చుకొనిరి? సాక్షి యెవ్వరు? సంతకమేది? అనరాదా! యని చారుదత్తునకు మైత్రేయుండు సలహా యొసఁగెను. దానికి మఱింతగా కలఁతపడి ఎంత మాట పలికితివి మిత్రమా! పోనీ బిచ్చ మెత్తియైన దాని నిచ్చు కొందును. అబద్ధమాడి నా శీలమును మట్టిలోఁ గలుపు కొందునా! అని చారుదత్తుఁడు దిటవు చేసికొని పలువురు పలు విధాల పలుకుదు రని కన్నము పూడిపించెను,

లోపల — ధూతాంబ, ఈ కల్లోల మెఱింగి సత్యవాక్యసంపన్నుఁ డగు తన మగనికి ఈ దురవస్థ దాపరించెనా యని పెల్లుగా దురపిల్లెను. సంసారము విచ్ఛిత్తియైన పిదప — ఆమెకు పుట్టింటివారు పెట్టిన రత్నాల హార మొక్కటిమాత్రమే మిగిలినది. పోయిన నగకన్న — ఇయ్యది మూఁడింతలు విలువగల సొత్తు. స్త్రీధన మంటుకో రాదని ఆ పెద్దమనుష్యుఁ డింతవఱకును ఏ అప్పులు సొప్పులకును దానిని అడ్డము పెట్టలేదు. ఇప్పుడుమాత్ర మాయన పుచ్చుకొనునా యని ఇల్లాలికి సంశయమే. దాని కొక యుక్తి పన్నెను. రత్నషష్ఠీవ్రత మని పేరువెట్టి మైత్రేయుని పురోహితునిగా నిర్ణయించుకొని ఆ రత్నాలహార మాతనికి ధూతాంబ దానమిచ్చెను. అతఁడు పట్టరాని సంబరముతో

దానిని పట్టుకొనిపోయి చారుదత్తునకుఁ జూపెను. అతఁడు వెఱఁగంది ఆమెశీల మిట్టిది గదా యని మెచ్చుకొని దారిద్ర్య మిట్టిపని చేయించునా యని కుంది — వంతురి, పోని! పోయిన రత్నాలహారమునకు దీనిని సరిపెట్టెదనులే యని మిత్రునితోఁ బలికెను. తింటిమా! కుడిచితిమా! దొంగ లెత్తుకొని పోయిన సొత్తునకు దీని నేల పంపెదవయ్యా! అని, యా బ్రాహ్మణుఁడు పాపము గిలగిల కొట్టుకొనెను. సుగుణవంతుఁడు చారుదత్తుని మ్రోల అతని యాటలు సాగలేదు; కాని, యందులో ఒక యుక్తిని జూపెను. ఏదో ఒక జూదములో సువర్ణభాండము తన దేయని భ్రమపడి పోఁగొట్టితి ననియు — ఆవల తెలిసికొని దీనిని బంపితిని గావున — తప్పక తీసికోవలెననియు తనమాటగాఁ జెప్పి బతిమాలి యిచ్చిరమ్మని చారుదత్తుఁడు మిత్రుని పురమాయించి పంపెను.

నాలవ ప్రకరణము

ప్రనాఁటిరేయి - ఆ ప్రయాణము చేసినది మొదలు వసంత సేన ప్రకృతి మఱింతగా మాఱిపోయెను. చారుదత్తుని సుగుణసంపదకు మెచ్చుకొనును; రూపసంపద కబ్బురపడును, ఆయన తనకెట్లు దక్కునా యని నిరంతర మొకటే ఆలోచన.

ఇంతలో దాసి యొకతె వచ్చి అమ్మా ! నిన్ను రాజస్యాలకుఁడు మోహించెనఁట. నీకోస మని ఆయన వేయి వరాలు పంపెనఁట. ధనమే పావనముగా నెంచఁదగు - ఈ వృత్తిలో ఇట్టి యవకాశము పీటేఁబుచ్చరా దని అమ్మ చెప్పి పంపెనని కబురు తెచ్చెను. దానికి గుండె ఝల్లుమని కన్నీరు మున్నీరుగా నేడ్చి-ఇది మొదలిట్టి వార్తలు మూటగట్టి తేవలదని గట్టిగా మూదలించి వసంతసేన ఆబిడను వెడలఁగొట్టెను. చిత్తశాంతికై తాను వ్రాసికొన్న చారుదత్తుని రూపపటము తోఁటలో మఱచి వచ్చినమాట జ్ఞప్తికి వచ్చి దానిని దెమ్మని మదనికను బంపెను. ఆమె రివ్వునఁ బోయి ఆ చిత్రపటము పట్టుకొని తదేక దీక్షగాఁ జూచుచు - ఇంటిలో

కాలు పెట్టుచుండఁగా వెనుక-కాళ్ల చప్పుడు వినవాయెను. వెను దిరిగి చూడఁగా- ఆతఁ డెవఁడో గాదు శర్విలకుఁడే. ఓహో! యని - ఇర్వురు పిలుచుకొని అట్టె నోటమాట లేక నిలువఁబడి పోయిరి. ఏమా! యింత ఆలస్యమాయెనని వసంతసేన గుమ్మము దాఁక వచ్చి, ఇర్వురను జూచి తలుపుచాటున నక్కి పొంచి పొంచి వారి మాటలు శ్రద్ధగా ఆలకింపఁ దొడంగెను:—

శర్విలకుఁడు:—మదనికా! నిన్ను దాస్యములో విడిపించి నాదానినిగాఁ జేసికోవలెనని యున్నదిగదా! ఎంత సొమ్ము - ఈయవలెనో చెప్పుకో చూతము.

మదనిక:—ఓయీ! నేను బానిసగా లేను సుమా! ఆమె మనస్సు మంచిది. నీవే అడిగినచో సొమ్ముమాట యెత్తకయే ఆమె నన్నిచ్చివేయు నని నా నమ్మకము. కాని, యొక మాట! వెలయే పెట్టినచో నీవేమి తేఁగల వోయి?

శర్వి:—చెలీ! ప్రేమయే సర్వసాధనములు తెప్పించి యిచ్చును. అయినను - అంత వ్యర్థుఁడనా యేమి? కావలసినంత సొమ్ము నీకోసమని తెచ్చితిని. ఇదిగో! చూడుము.

అని స్వర్ణాభరణము చూపి చౌర్యవృత్తాంతము సర్వము చక్కగా వినిపించెను.

అయ్యయ్యో! చారుదత్తుని యింటనే కన్నము వైచితివా? ఆయనకు ఏమైన హాని చేయలేదు గదా! యని మదనిక కళవళపడుచు కన్నీరు కార్చుచు నిర్విణ్ణయై ప్రశ్న వైచెను. ఈబిడ చారుదత్తుని పేరు ఎత్తినదే తడవుగ శర్విలకుని మనస్సులో ఏదో బండ పడెను. ఆ నడుమ ఒకసారి మదనిక చారుదత్తుని యింటికి పోయిన ట్లెవ్వరో వాని చెవిలో వేసిరి. ఇప్పుడు చేతిలో చారుదత్తుని పటమే కానవచ్చినది. మీదుమిక్కిలి తదేకదీక్షగా దానినే చూచుచున్నది. అపాయము జరిగెనా యని మఱిమఱి కళవళపడి అడుగుచున్నది. ఇవి యన్నియు వాని డెందమునకు ఆందోళనము తెచ్చిపెట్టెను. మోము వన్నెయే మాఱిపోయెను. కనుబొమలు ముడివడియె. చూపులలో చుఱుకు కలిగె. ఒడలు కంపించిపోయె. ప్రియురాలా! ఇట్లైతివేల ! నిన్నెవ రేమనిరి ? అని మదనిక గ్రుచ్చిగ్రుచ్చి యడిగెను. ఛీ! ఆడుజాతిని నమ్మరాదు. అందును వెలయాండ్ర నేస్తములో అర్థమే లేదు. అచ్చికబుచ్చిక మాటలకు — కల్లబొల్లి కూతలకు — పైపై నిగారింపులకు మురిసిపోయి పండువంటి బ్రాహ్మణవంశమును పాడుచేసికొంటిని. నన్ను

భ్రమింపఁజేసి నట్టేట ముంతువా ? ప్రభుకార్యము సైతము విడువరాని సమయములో విడిచి వచ్చితినే! ఏదో ఒఱుఁగబెట్టెద వని పుట్టెఁడాసతో నీ కొంప చేరితిని. కొండకొమ్ములో తామర తూడు మొలుచునా ! గాడిద కడుపులో గుఱ్ఱపుఁబిల్ల పుట్టునా? పడుపుగూడెములో పతివ్రతామణి దొరకునా? అని ఏమేమో అఱచుచు, ఓరీ ! చారుదత్తుఁడా ! అప్పుడే నిన్ను గొంతు పట్టి పఱపఱ కోసి చంపనైతినిరా యని కోప మాఁపుకొనలేక గ్రక్కున - ఆతఁడామాట కక్కివైచెను.

అయ్యో! అయ్యో! అంత పనియే! ఇప్పటికిఁ జేసినదే చాలు. అదే జరిగెనా మా వసంతసేన నిమేషమేని ఓర్చునా? క్షణకాలమేని బ్రదుకునా? అని యామదనిక, వసంతసేనా చారుదత్తుల వలపు గాథలు పౌర్వాపర్యము లెఱింగించి, మొన్ననే ఈ సువర్ణ భాండమును వసంతసేన ఆయన యింట దాఁచి వచ్చినదని ఆ రహస్యము బాహిరపఱచెను. ఔరా! పొరపడితినే యని శర్విలకుఁడు ఔదుగఱచి నిదానించి ఆలోచించి ఈ దోసము నకు ప్రతీకార మేమని నివ్వెఱపడి యడిగెను. వెంటనే ఆబిడ - మాట అందుకొని, ఓయీ! ఒక్క పని చేయుము. చారుదత్తుఁడు పంపెనని నీవే వచ్చి దీనిని వసంతసేన చేతిలో

పెట్టుము. అద్దాన మూఁడు లాభములు:—అప్పుడు నీవా దొంగవు కావు; చారుదత్తుఁడా ఋణవిముక్తుఁ డవును. వసంత సేన సొమ్ము వసంతసేనకే దక్కును. ఆమె హృదయము వెన్న వంటిది. అని యుపాయము చెప్పి ఆతని మెప్పు నడసి తనవెంట వానిని దోడ్కొని ఆలస్య మాయెనే యని లోనికిఁ బోయెను.

లోపల వసంతసేన యేమియు నెఱుంగని నంగనాచివోలె మొగము వంచుకొని కూరుచుండెను. ఏమే మదనికా! చిత్రపటము కనుపడలేదా! పాపము! ఆలస్యమైనదని యామె ప్రశ్నించెను. అమ్మా! కనఁబడినదికాని చారుదత్తుఁవారి మనుష్యుఁ డొకఁడు - ఇదుగో వచ్చియున్నాఁడు. అందువలన - ఆలస్యమైన దని ఆబిడ శర్విలకుని పిలిచి ఆమెకు చూపెను. అయ్యా! రండు రండు! కూర్చుండుఁడని వసంతసేన ఆతనిని గౌరవించెను. వాఁడును గూర్చుండి చారుదత్తుఁడు పంపఁగా వచ్చితినని పలికెను.

వసంతసేన :— అయ్యా! మీరు చారుదత్తునకు సన్నిధాన వర్తులా యేమి? ఎన్నఁడు మిమ్ము చూచిన జ్ఞప్తియే లేదే!!

శర్విలకుఁడు:— అవును : మావంటి అక్కుపక్షు లెన్నో ఆ కల్ప వృక్షము నీడలో ఆశ్రయించి యుండును.

వసంత :— ఆయనకే జరుగదఁటగా! మిమ్మెట్లు పోషించు నయ్యా ?

శర్వి:— నిజమే ! అది యొకనాఁటి మాట. నేఁడో ఎవరికి అనువైన వృత్తిలో వారు దిగి పొట్టపోసికొనుచున్నారు.

వసంత :— చౌర్యముకూడ అందులో చేరినదాయేమి ? సరే! మీరు తెచ్చిన వర్తమాన మేమి ?

శర్వి :— సువర్ణభాండమను ఆభరణము ఆయనవద్ద ఉంచితి వఁటగా !

వసంత :— అవునవును !! దొంగ లెత్తుకొని పోలేదుగదా ? ఆ యింటికి పైదొంగ లెవరు వత్తురులే !

శర్వి :— ఆ భయముచేతనే ఆయన దీనిని బంపినారు. ఇదిగో తీసికో !

వసంత :— అయ్యా! ఇది పంపుటలో ఆయన ఉద్దేశ్యమేమో తెలియునా ?

నా కేమియుఁ దెలియదని ఆతఁడు వింతపడి చూచెను. ఇదిగో! వినుము. ఈ వస్తు వెవ్వరు తెచ్చి యిత్తురో వారికి నా ప్రియతమమైన వస్తువు ఈయవలెనని ఏర్పాటు కద్దు. ఆ వస్తువేమో యెఱుఁగుదువా? అని ముసి ముసి నగవులలో మునిఁగి ప్రశ్నించెను. తెలియదని శర్విలకుఁడు సమాధాన మిచ్చెను. నీకైనఁ దెలియదఁటే! అని మదనిక వైపు తిరిగి యడిగెను. ఆబిడయు మొగము వంచుకొని మౌనము వహించెను.

ఓసీ! ఇంతే మీ యిర్వురి పరిజ్ఞానము? చాలుఁజాలు. నా ప్రియతమమైన సొత్తు – ఈ మదనికయే. ఇదిగో! ఇత్తును తీసికోవయ్యా! అని వసంతసేన నవ్వు మొగములో ప్రేమము జాలువాఱ – పలుకుచుండఁగా – గుట్టు బట్టబయ లాయెనే యని మదనిక సిగ్గుపడెను. శర్విలకుని మొగము వింతగా – ఇంతయై కళకళలాడెను.

అయ్యా! ఇందులో ఉన్న రహస్య మిది:—వ్రేపల్లెలో దీని వలపుకాఁడు ఒకఁ డున్నాఁడు. ఆతని పేరు శర్విలకుఁడు. ఆతఁడే ఈబిడవు పంచప్రాణములు. నిచ్చలు – ఈబిడ చేయు వర్ణననుబట్టి చూడఁగా మీ రూపు

రేఖలే నామదిలో మెదలుచున్నవి. అదే పొడుగు - అదే రూపు ; అదే యీడు, ఆతఁడే ఈతఁడేమో యని తొలుత అనుకొంటినిగూడ. ఓసీ మదనికా ! రూపులో ఏమున్నదే ? యాదృశీ భావనా తాదృశీ కార్యసిద్ధిః. పోసీ ! ఈయనను ఆయనగా భావించి స్వీకరింతువా లేదా ! అని వసంతసేన కల కల నవ్వి ఆ యిర్వురను ఒక్కపెట్టున సిగ్గుదొంతరలో ముంచి వైచెను.

సరే ! నేఁటితో దాస్యవిమోచన మని ఆమె నిర్ధరించి, సంసారమునకు కావలసిన సర్వపదార్థములు సర్వాభరణములు బహూకరించి బండి యొకటి తెప్పించి వారి నిర్వురను ముచ్చటగా పంపివైచెను.

ఇంతకు - కొన్నాళ్లకు మున్ను ఆకసమున తోఁకచుక్క కానవచ్చెను. జోస్యులు రాజునకు పెద్ద అరిష్టము అనిరి. రాజ్యములో అరాజకలక్షణములు తోఁచెను. స్యాలకుని ఉపద్రవము దానికి పెద్దతోడయ్యె. దేశమంతయు అట్టుడికిన ట్లుడికిపోయెను. కుట్రలు - పన్నుగడలు - వ్యూహములు ప్రజలలో బయలుదేఱెను. ఎవఁడో సిద్ధుఁడొకఁడు ఉజ్జయినికి వచ్చి ఈ మాట చెప్పిపోయెను:—

వ్రేపల్లెలో కాఁపుర మున్న గోపాలబాలకుఁ డొకఁడు — ఈ దేశమునకు రాజు కాఁగలఁడు. ఆతని పేరు ఆర్యకుఁడు అని.

ఈ మాట విని — ఎక్కడివా రక్కడ వేలమువెట్టిగా వ్రేపల్లెకు చేరసాగిరి. సిద్ధుల మాట మనోరథసిద్ధికి మూలకందమని ఆపదలో మఱింత నమ్మకము కుదురును. పల్లెగా నున్న వ్రేపల్లె పట్టణముగా మాఱిపోయెను. ఎక్కడఁ జూచిన — ఈ మాటలే; ఈ కబురులే; ఈ జోస్యమే. ఆ గొల్లకుఱ్ఱవానికి పదునాఱేండ్ల యీడు, మంచి జబ్బపుష్టి — సోయగము క్రుమ్మరించు ఎగుబుజముల నీటు — కలువలకాంతులు వెదఁజల్లు కందోయి మెఱుఁగు — ఱొమ్ము విఱుపు — ఆజాను బాహువులు; ఇట్టి దివ్యాంశములు ఆతని రాచఱికపు ఠీవిని పట్టి యిచ్చుచుండును. ఆ జోస్యము ఈ సాముద్రికముచే పిరులుగొని అందఱి మనోవీథిలో ఆతఁడే రాజై కూరుచుండెను. దేశ మెల్లెడల — ఈ వార్త పాకిపోయెను. పాలకమహారాజు పరిస్థితి తాఱుమాఱాయె. ఆర్యకుఁడు — ఏ మూలగా ఏ సమయములో ఏ వ్యూహములో వచ్చి రాజ్యము గుంజుకొనునో యని ఈతని కొకటే బెంగ. రేయి నిదురయే లేదు. పగలు తిండియే తినఁడు. దాడిగా ఎత్తివచ్చి వ్యవహారము

తేల్పవలె నన్న - రాచసిబ్బందిలో నమ్మకమే తగ్గిపోయె. ప్రజలే తిరుగఁబడుదురో? తన సేనయే తన కెదురగునో యనునంతదాఁక వచ్చెను.

ఊరి - పెద్దతలారి వీరకుఁ డను వాఁడు, వ్రేపల్లెకుఁ బోయి ఆర్యకుని పట్టి కట్టి తెత్తునని జేని మ్రోల ప్రమాణము చేసి ప్రయాణమాయెను. అతఁ డొక్కఁడే జేనికి నమ్మిన బంటు. గూఢచారియై పోయి గాఢమైన రాజ భక్తితో సర్వసౌకర్యములు సమకూర్చుకొని వ్రేపల్లెలో తిష్ఠవేసెను.

అప్పుడు - ఆర్యకుని ఆశ్రయ మునకై దేశదేశాల ప్రజలు తిరునాళ్లకు వోలె గుంపులు కట్టి వచ్చిపడుచుండిరి. ఆర్యకునకు శర్విలకునకు ఎన్నఁడో నేస్తము కుదిరి గట్టిపడెను. ఈ సందడిలో పాలకరాజు ఆర్య కుని ఏమి చేయించునో యని కంట వత్తిడికొని రేయుంబవలు శర్విలకుఁడు వానిని గాపాడుచుండును. కత్తులు కటారులు చేర్చి ఒక సిబ్బంది కూర్చి ఒక కొలువుగా ఏర్పఱచి రాచటి కపురీవికి నాందీప్రస్తావము కావించిన నటకావతంసుఁడు - ఈ శర్విలకుఁడే. స్వప్రయోజనము మాట సూన్యైన - ఎత్తేఁడు.

లాఁటి వారు సైతమీతని త్యాగమును మెత్తురు. ఉద్యమములో కలసి వత్తురు; కాని చేతిలో ఈతనికి చిల్లిగవ్వయును లేదు. సొమ్ముకై పాపము! పడరాని పాట్లు పడుచుండును. ఈ జంజాటమువలన చేతిలో ఉన్న నాలుగు పైసలు దూసికొనిపోయె. కాఁబోవు రాజును దానే పోషింపవలసియు వచ్చెను. తాను వలచిన మదనికకోసమై ఆనాఁడు ఉజ్జయినికై యిష్టము లేకయే ప్రయాణము కట్టెను. ఒకవంక — ప్రభుభక్తి; మఱొకవంక మోహశక్తి. రెండింటి నడుమ ఊఁగిసలాడుచుండెను. అట్టి అదనులో కనిపెట్టి తలారి వీరకుఁడొకనాఁడు శర్విలకుని గలసికొని ఉజ్జయినినుండి వచ్చితి ననెను. మదనిక పంపెనేమో యని ఈతఁడు భ్రమపడెను. అది గుఱుతించి వీరకుఁడొకానొక వ్యూహము పన్నెను:—అయ్యా! మదనిక పెద్దచిక్కులలోఁ జిక్కియున్నది. రాజస్యాలకుఁ డామెను మోహించి పొంచిపొంచి యున్నాఁడు. ఒకనాఁడు వీధిలో ఆతఁడు బలిమిమై పట్టఁబోవఁగా ఉపాయముగా ఆమె చారుదత్తుని యింటిలోఁ దూఱెను. ఏదో ప్రస్తావములో — ఈ ప్రాంతమునకు ప్రయాణమైన నన్ను గుర్తించి ఈ మాట నీతోఁ జెప్పుమని బతిమాలి భంగపడి కన్నీళ్ళు పెట్టుకొన్నది. ఆ యేడుపు చూడలేక ఈ వార్త తప్పక అందింతునని

మాట యిచ్చి సముదాయించి యిటు వచ్చితిని. నా బరువు తీఱినది. మీరేదో రాజకీయముల గొడవలో మునిఁగియున్నారఁట. ఉత్తరము చేతి కిచ్చిన చిక్కులు వచ్చునేమోయని నోటిమాటగా చెప్పినది. తరువాత మీ యిష్టము. నేను పోయివత్తునని వీరకుఁ డనెను. అక్కటా! ఎట్టి యిక్కట్టులు వచ్చినవి? ఔరా! స్యాలకా! నీకెంత పొగరురా? సరే చూతును గాచుకో!! అని శర్విలకుఁ డాగ్రహించి నిట్టూర్చి, ఆర్యకుఁ డప్పుడు నిద్ర వోవుచుండుటఁ జేసి – ఈ యుత్తర మాతని మంత్రిచేతి కిమ్మని ఆ క్రొత్తమానిసికి వ్రాసి ముద్రవైచి యిచ్చి తాను తన అడావుడిలో ఉజ్జయినికిఁ బోయెను.

ఇక్కడ – వీరకుఁ డా యుత్తరము చింపి చూచి శర్విలకుని సంతకము మాత్రము వదిలము చేసికొని ఆర్యకునివద్దకు చేరి యిట్లని విన్నవించెను:—అయ్యా! ఇప్పుడే మీరు ఉజ్జయినికి పోయినచో అన్నియు అనుకూలము లగునఁట! ప్రయాణము మాట యెవ్వరికిని దెలియరాదఁట. శర్విలక మహాశయుఁడు ముందుగాఁ బోయి ఊరివెలుపలఁ గాచుకొని యున్నాఁడు. మిమ్ము వచ్చి కలసికొమ్మని నాతోఁ జెప్పి పంపెను. మీకుఁ దోడుగా నన్ను నియమించెను. ఇదిగో! ఆయన సంతకమని చూపి నమ్మించి అతనిని ప్రయాణము చేయించెను.

అనాఁడు మదనికను దీసికొని వసంతసేన సెలవు గైకొని క్రొత్త పెండ్లికొడుకువోలె శర్విలకుఁడు బండి యెక్కి వీధిలోనికి వచ్చెనో లేదో ప్రజలు గుట్టలుగుట్టలుగ పడి గుసగుస లాడుచుండిరి. ఏమా! యని శర్విలకుఁడు బండి దిగి విచారింపఁగా - కాఁబోవు రాజును ఆర్యకుని వీరకుఁడు బందిచేసి తెచ్చుచున్నాఁడని తేలినది. అది విని పాప మాతని గుండె కలగుండు వడియె, అనుకొన్నట్లే జరిగినదే యని హతాశుఁ డయ్యె. వలపుబలుపుచే ప్రభుకార్యము మంటఁగలిపితినే యని బిట్టుగ పరితపించెను. అయినను జూతునుగాక! ఆర్యకునే నేను విడిపింపనేని నా పేరు శర్విలకుఁడే కాదు. అని శపథము చేసి తన మిత్త్రుఁడు రేభిలుని యింటికి బండిని బోనిమ్మని ఏర్పాటు కావించి ప్రభుకార్య నిర్వాహణములో తాను మునిఁగిపోయె.

దొంగలు పడిన మఱునాఁడె లోక మేమనుకొనునో యని బెదరి చారుదత్తుఁడు, రత్నహారమును చేతి కిచ్చి వసంతసేన యింటికి మైత్త్రేయుని బంపెను. ఆతఁడుస్సురని వగచియు తప్పనిసరి కావున పైనమై వచ్చి వచ్చి వసంతసేనా దివ్యభవనములో కాలు పెట్టెను. అష్ట ప్రకోష్ఠకంబై రాజమందిరమును బురుడించు - ఆ భవనము

చూచి ఆ బ్రాహ్మణుఁడు నివ్వెఱవోయెను. ఆతఁడు వచ్చెనని ఎవరో లోపల చెప్పఁగా వసంతసేనయే ఎదురేఁగి జోహారు చేసి మర్యాద గావించి పీఠముపైఁ గూర్చుండఁబెట్టి యోగక్షేమము లిట్లని విచారింపఁ దొడంగెను:—

వసం :— అయ్యా ! మీ మిత్రులకు కుశలమా ? దారి తప్పి వచ్చినట్లున్నది. ఊరక రారు పెద్దలు.

మైత్రేయుఁడు :— అందఱకు క్షేమము. నీవు ఉంచి వెళ్లిన సువర్ణభాండము జూదరులు దొంగిలించిరి.

వసం :— జూదరులు కాదు స్వామీ ! దొంగలు కాఁబోలు !!

మై :— కాదు కాదు ; పొరపాటు.. జూదములో చారుదత్తుఁ డోడిపోయినాఁడు.

వసం :— ఇదేమయ్యా ! మీ మిత్రుఁడు జూదరియా యేమి ? అట్టి పిచ్చిచేష్టలు లేవనుకొంటినే !!

మై :— ఏదో జరిగినది పోనీ ! పోయినదానిని త్రవ్వకుము. జూదములో సువర్ణభాండము ఓడిపోయి — ఇదిగో! ఈ రత్నావళిని బంపినాఁడు. అని దాని నిచ్చెను.

దీని వెల యెంత? తమ నగలోఁజే మా నగను తాకట్టు పెట్టిరా? ముందే మా నగను ద్యూతరంగములో పెట్టిరా? అని యేమేమో చిక్కు ప్రశ్నములు చిద్విలాసముగ ఆమె అడుగుచుండఁగా - ఆతనికి చిరాకు పుట్టి మొగము ముటకరించుకొని లేచి పైన మాయె. సరే! నేనే వచ్చి మీ ధర్మరాజుసన్నిధిలో సర్వసంశయములు తీర్చుకొందునులే యని ఆమె వానిని వీధిలోనికి స్వయముగ సాగనంపెను.

## అయిదవ ప్రకరణము

నాఁటి సాయంసమయమున హఠాత్తుగ మబ్బులు పట్టి సన్నసన్నగ చినుకులు రాలసాగెను. ఆకసమున కాఱు చీఁకట్లు క్రమ్మి త్రోవయే కానరాదాయె. మైత్రేయుఁడు మిత్రుని యింటికి చేరినపిదప వాన జోరుగ కురియఁదొడఁగెను. ఆతఁడు వచ్చిన దేతఃవుగ పని యేమైనదని చారుదత్తుఁడు ప్రశ్నించెను. పని భగ్నమైనదని ఆతని సమాధానము. అయ్యో! రత్నావళిని బుచ్చుకోలేదా యని చారుదత్తుఁ డారాటపడెను. అంతటి యదృష్టము మన కెక్కడిదయ్యా! చక్కఁగా చేయి చాఁపి శ్రీరామార్పణ మని రత్నహారమును స్వీకరించినది. పైఁగా – మన యింటికి ఈ రేయి ఆబిడ వచ్చునఁట! తన వస్తువున కీవస్తువు చాలదని వివాదము పెట్టి మఱి కొంత సొమ్ము గుంజుకొనుటకే ఈ యెత్తుగడ అంతయు. మిత్రమా! నీవు వట్టి పూర్వకాలపు మానిసివి. అంతలోనే నమ్మెదవు. వివాదము లేని పల్లెయు ధనాశ లేని సానియు మెతక లేని అగసాలెయు మోసము లేని వర్తకుఁడును లోకములో ఉండురటయ్యా! నీ వేదో వెఱ్ఱిపోకిళ్ళు పోయెదవు గాని. అని విసుగుతో మైత్రేయుఁడు పలికెను.

ఆ మాటలకు చారుదత్తుఁడు నవ్వుకొని, అమాయికపుబ్రాహ్మణుఁడా! ఆబిడ నీ వన్నంత తేలికమైనది గాదు; ఆమె శీలము నీకేమి తెలియును? పోనీ! ఆమె వత్తునన్నదా? సరే! కానీయని సంతోషముతో ఆబిడ రాకకై ఎదురుచూచుచుండెను.

మోహము సాహసకార్యములకు మూలకందము. ఆ జబ్బు ఒంటికి సోఁకెనా పిఱికిమానిసి సైతము తెగఁబడి త్రిమ్మరును. వాన కురియనీ ఉఱుములు ఉఱుమనీ పిడుగులు రాలనీ. కామినీవర్గము లవలేశము వానిని లక్ష్యపెట్టదు.

జోరున వాన కురియుచుండఁగా – ఆ ముసురులోనే కటికి చీకఁటిలో ఉఱుముల మెఱుముల దండడిలో వసంతసేన చారుదత్తుని యింటికి ప్రయాణమాయెను. నాణ్యమైన నగలు పెట్టి విలువయైన వలువలు కట్టి చక్కని ముస్తాబు చేసికొని వింతహొయలు కాంతులీనుచుండ – చెలికత్తె గొడుగు పట్టియుండ – కుంభీలకుఁడను చేటుఁడు వెంట నంటి వచ్చుచుండ చారుదత్తుని గుమ్మములో కాలుపెట్టెను. భోజనము లయి మిత్రు లిర్వురు తాంబూలము వేసికొనుచు వసారలోఁ గూరుచుండిరి. ఏదో చప్పుడు కాఁగా

రదనిక తలుపు తీసి చూచెను. రివ్వున లోనికి మెఱుపువోలె వసంతసేన ప్రవేశించెను. మెఱుపులకు సైతము మెఱుఁగు లిచ్చు ఆ మెఱుంగుఁబోఁడి శరీరలావణ్యము చారుదత్తుని కందోయికి మిఱుమిట్లు గొలిపెను. ఆమెయు సిగ్గుతో ఒదిగి యట్టె నిలిచిపోయెను. చూపులలో చుఱుకుఁబాలు ప్రసరింప వచ్చు. ముసిముసి నగవులు పెదవులలో నాట్యమాడవచ్చు. మాటలు మాత్రము సాగవయ్యె.

సాపడినపిదప మైత్రేయునకు చిరాకు దూరమై పోవును. ఓహో! వచ్చితివా వసంతసేనా! ఆ ధర్మసందేహము తీఱవలెఁగాఁబోలు? చూతు వేమయ్యా మిత్రమా! అని మైత్రేయుఁడు చారుదత్తుని హెచ్చరించెను. సమయోచితమైన సమ్మానము కావించి చారుదత్తుఁ డామె డెందమునకు విందులు గొల్పెను. ఏదో మాటలో మంతిలో - నీ సువర్ణభాండము నీకు అందింపలేకపోయితిని గదా! క్షమింపుమని చారుదత్తుఁడు పలికెను. రత్నహారము వెలయెంత యుండునో యని వసంతసేన సూచనగా ఒక మాట అనెను. అబ్బో! దానివిలువ యెంత యనుకొంటివి? నీ సొమ్ము కన్న మూఁడింతలు నెల యెక్కువ యని మైత్రేయుఁడు మాట అందుకొనెను. అయ్యో! జూదములో దాని నోడి

పోయితిని. విలువ తెలిసినచో విడిపించుకొందునయ్యా! అని నర్మగర్భితముగా నవ్వుచు వసంతసేన పలికెను. వెలవెలపోయి చారుదత్తుఁడు, అది యెప్పటిదో పురాతనవుసొత్తు. దాని విలువ చెప్పలేను. పోసీ యనెను. పోసి! ఇదిగో – ఈ నగ తీసికొని నాకొక రత్నాలహారము చేయించిపెట్టెదరా యని ఆమె యా సువర్ణభాండమును వారికిఁ జూపెను. చారుదత్తుఁడు నివ్వెఱపోయి, ఇది యెక్కడిది దని యడిగెను. ఈ ఘట్టము వ్యాసఘట్టము. పదవడి వివరింతును. ఇది నాకుఁ జేరినది కావున మా అక్కగారి రత్నావళి ఆమెకే యిమ్మని వసంతసేన – సువర్ణభాండమును చారుదత్తునిచేతికి ఈయఁ బోయెను. ఇచ్చినది మఱల పుచ్చుకొనరాదని చారుదత్తుఁడు తల యూఁపెను. ప్రేమకు – ఇయ్యది కానుక కాఁబోలు నని మైత్రేయుఁడు మాట కలిపెను. వసంతసేన ముసిముసి నగవులతో వంచిన తల యెత్తదాయె.

చినుకులు పడి బట్టలు తడిసిన వేమోయని రదనిక దుస్తులు తెచ్చి ఆమె కిచ్చెను. ఆ నాఁటి రేయి వసంతసేన తనయింట నున్నట్టులే తలఁచి హృదయము కలిపి అచ్చటముచ్చటలతో ఆప్యాయముగ కాలము గడపెను.

ప్రత్యూష పవనాంకురములు పైకొను ప్రశాంతవేళ చారుదత్తుఁడు మేల్కాంచి కాల్యకరణీయములు తీర్చుకొని వర్ధమానుని బిలిచి, వసంతసేన మేల్కాంచినపిదప బండిమీఁద - ఆమెను దీసికొని రమ్మని పూలతోఁటలో విహరింపను మైత్రేయునితోఁ గలసి పోయెను.

అమ్మా! అమ్మా! తెల్లవాఱెనదని రదనిక వసంతసేనను మేల్కొల్పెను. ఛీ! పాడుదానను; ప్రొద్దెక్కినదాఁక పరుంటినా? మీ యయ్యగారు ముందే లేచిరా! అని వసంతసేన సిగ్గుపడి లేచెను. అమ్మా! నీ పనులు ముగిసినపిదప నిన్ను తోఁటకుఁ దీసికొని రమ్మని పురమాయించి ఆయనగారు ముందే వెళ్లిరని రదనిక ఆ వార్త వినిపించెను.

కొంతసేపటికి లోపలినుండి అల్పాహారము పుచ్చుకొని మఱి ప్రయాణము చేయుమని ధూతాంబ వసంతసేనకు కబురు పంపెను. అవురా! ఆమె సౌజన్య మేమి? లోకములో ఎందైన ఇట్టిది విందుమా? కందుమా? అనుకూలవతి యగు ఇల్లాలుసైతము మగనికి వేఱొక్కతె యున్నదన్నచో వలవల యేడ్చును; గిలగిల

కొట్టుకొనును. పైగా – ఆమె తానున్న యింటిలోనే ఉండవలసి వచ్చెనా! ఆబిడ విచారము చెప్పఁబనిలేదు. ధూతాంబకు ఆ గొడవ లవలేశము లేదు. వసంతసేనను చెల్లెలుగా మన్నించుకొనును. మగని సంతోషమే తన సంతోషము; మగని యిష్టమే తన యిష్టము. భరతఖండములో ఉత్తమ పతివ్రతామణుల వైఖరి యిట్టిదే సుమా! ఆమె శీలమునకు రిచ్చవడి వసంతసేన చెచ్చెర గదిలోనికిఁ బోయి రత్నహారమును దెచ్చి, అక్కగారు ధరించిన సొమ్ము నేను ధరింపను దగనని పలికి రదనికచేతి కిచ్చి లోనికి పంపెను.

పంపెనో లేదో అప్పుడే రదనిక తిరిగి వచ్చి, అమ్మా! అమ్మగారిది పుచ్చుకోలేదు. తన పెనిమిటి నీకిది అనుగ్రహసూచకముగా ఇచ్చియుండఁ దానిఁక మరల పుచ్చుకోరాదఁట. తనకు – ఆయనయే అలంకారమఁట. అని పలికి యా రత్నావళిని ఆమెచేతి కందించెను. ఇంతలో నింటిలో రోహసేనుఁడు పోరువెట్టి ఒకటే మొగిని ఏడ్పు మొదలుపెట్టెను. రదనిక పోయి వాని నెత్తుకొని, ఇదిగో! బండిని జూడవయ్యా బాబు!– అని యెంతో సమదాయించుచు త్రిప్పుచుండెను. వాఁడును మారాము విడువఁడు. మట్టిబండి నాకేల యని గట్టిగా అఱచును; ఏడ్చును; విఱుగఁబడును

వచ్చినను గొంతెత్తు పిల్లలు ముద్దులు మూటలు గట్టెదరు. కన్నులనిండ నీరు తిరిగి – వచ్చియు రాని పలుకులతో కులు కులు గులాబించు ఆ కుఱ్ఱవానిని వసంతసేన చూచి, ఎవ్వారే యీ పిల్లవాఁడని రదనికను ప్రశ్నించెను. అమ్మా ! అయ్య గారి బిడ్డయమ్మా ! రోహసేనుఁ డని పిలుతురమ్మా ! అని యాబిడ మాఱువలికి ఆతని గొడవలోనే మునిఁగిపోయెను. రా బంగారుబాబూ ! రావోయి నా చిన్నితండ్రీ ! రావయ్యా నా కన్నులచందమామా ! రారా ! నా గారాలకూచీ ! అని యామె చేతులు చాఁచి దగ్గఱకుఁ బోయెనో లేదో అమాంతము – ఆ కుఱ్ఱవాఁడు ఎక్కినచంక దిగివచ్చి ఏడుపు మాని దానికి వెనుకఁ జేరి తొంగితొంగి చూడసాగెను.

ఆహా ! అచ్చముగా అదే రూపమా ! చెట్టునఁ గోసి తెచ్చినట్లు వంకలు లేని వన్నె చిన్నెలా ! భాగ్యములు లేకున్నమానె – ఇట్టి పతివ్రతాశిరో మణి – ఇల్లాలుగా నుండఁగా – తద్దయు ముద్దులు గొలుపు మోహనాకారుఁడు బిడ్డయై కన్నులపండువు గూర్చుచుండఁగా– ఆయన కేమి లోపము? ఆయన మహారాజు, ఆయన భాగ్యమే భాగ్యము. ఇంతకు మా యక్కగారు మిక్కిలి అదృష్ట వంతు రాలు. అని వసంతసేన సంతోష మంతరంగమున తరంగ

తరంగములుగ వెల్లివిరియ - కులుకుచుఁ బలుకుచు, బాబూ! ఎందుల కేడ్చుచున్నావని కుఱ్ఱవానిని ప్రశ్నించెను. వాఁడు ఉలుకఁడు; పలుకఁడు. కాని తలయెత్తి తొంగి చూచును. అప్పుడు దాసి, అమ్మా! పొరుగింటి కోమట్ల కుఱ్ఱవాఁడు బంగారుబండితో ఆడుకొనుచుండఁగా తనకు సైత మట్టి బండియే కావలెనని ఈయనగారు మారాము పట్టెను. మన కా వైభవములు లేవు నాయనా! వచ్చినప్పుడు చూచుకొందము. ఇప్పుడీ మట్టి బండితో ఆడుకోవయ్యా యని గడ్డము పట్టుకొని బతిమాలినను నామాట వినఁడు; పోరు మానఁడు, అని యాబిడ పూర్వాపరములు వివరించెను.

అది విని వసంతసేన డెందము కరఁగిపోయెను. అయ్యో! అంతవాని కడుపున పుట్టిన యీ కుఱ్ఱవాఁడు నోరు తెఱచి ముచ్చటపడి కావలెనని అడిగిన ఆటవస్తువును దెచ్చి యిచ్చుటకు గతి లేకపోయెనే! విధి విలాసము లెవ్వ రేమనఁగలరు? ఓడలు బండ్లు, బండ్లు ఓడలు అగును గదా! మా తండ్రీ! ఏడువకయ్యా! బంగారుబండి చేయించుకొందువు లే! అని యా వసంతసేన ఆ బిడ్డని సముదాయించి దగ్గఱకుఁ దీసికొని ముద్దులాడెను. రదనికా! ఎవ్వరే యీమె? నన్ను వదలింపవే! చూతువేమే యని బాలుఁడు

పెనఁగులాడెను. బాబూ! భయము లేదులే! ఈమె మీ యమ్మయే నాయనా! యని రదనిక పలికెను. ఛీ! నోరు మూయుము; మా యమ్మయే అయినచో ఇన్ని నగ లెక్క డివే? అని కుఱ్ఱవాఁ డెదురు తిరిగెను. వసంతసేన కన్నులలో నీళ్ళు గిఱ్ఱున తిరిగినవి. తండ్రీ! నీ మాట లేమిరా! యని ఆబిడ మురిసిపోయి మెడలో నున్న నగ లన్నియు ఒలిచి, ఇదిగో! వీనితో బంగారుబండి చేయించుకో నాయనా యని మట్టిబండిమీఁద వానిని గుప్పగాఁ బోసెను. పిన్నమ్మ వచ్చిన దని అమ్మ చెప్పినది. ఎవరే యీమె? యని కుఱ్ఱవాఁడు మఱల రదనికను ప్రశ్నించెను. అవును నాయనా! ఈమెయే మీ పిన్నమ్మ యని రదనిక దానిని బలపఱచెను. ఆ ఘట్ట ముతో వసంతసేన మఱింత ద్రవించిపోయి బిడ్డను గుండెలకు గట్టిగా అదుముకొని ముద్దులు కుమ్మరించి నెటికలు విఱిచి కాటుకతో బుగ్గమీఁద చిన్నిచుక్క పెట్టి దిష్టి తీసివైచెను.

ఇంతలో బండి వచ్చెనని వర్ధ మానకుఁడు వీథిలో కేక వెట్టెను. వచ్చెవచ్చె నని రదనిక సమాధాన మిచ్చి ఆ ప్రయత్నములో తాను మునిఁగి పోయెను. వంట అయినదే రదనికా యని ఇంటిలో పిలుపు కూడ వినవచ్చెను. సరే! ఎవరిపని వారు చూచుకోసాగిరి.

వీథిలో. నిలిచిన బండిమీఁద తివాసి వేయుట మఱచిపోయి వర్ధమానకుఁ డిదిగో తెత్తునని నాలు గడుగులు నడచెను. పొగరుఁబోతు గిత్తలు బండిని దడదడలాడించి ముందునకు లాగెను. ఓహో! వీని పొగరు దియ్య!! ఆగవే యని వాఁడు అదలించి, పోనీ బండినే తోలుకొని పోయి మఱల వత్తునని పెరటిలోనికిఁ బోయెను. అంతలో వేఱొక్క బండి దడదడలాడుచు అచ్చటికే వచ్చి తటాలున ఆఁగిపోయెను. అది రాజస్యాలకుని బండి. ఆబండివాఁడు బండి తోలుకొని ఆ వీథినే వచ్చుచు పెత్తనములు గొట్టుచు లిల్లాయిపాటలు పాడుచు పరధ్యానములో మునిఁగియుండెను.

పుష్పకరండక మను తోఁటను— పాలకుఁడు స్యాలకున కిచ్చినది మొదలు దాని సొబగే రూపు మాసెను. ఆలన-పాలన లేదు. కొమ్మలు రెమ్మలు విఱిగినను పుట్టలు పొదలు వేసినను-ఆకులు-అలములు రాలినను పరామరిక సేయువారే బొత్తిగా లేరు. జీర్ణోద్యానమని దానిని పదిమంది పిలుతురు. అందులో కొంతభాగము నగరవాసుల కని విడిచి తక్కినదానిని శకారుఁడే ఏలుచుండును. అక్కడికే నాఁటి యుదయ మాతఁడు బండిని దెమ్మని నౌకరికి చెప్పి తాను విటులతో నడచి, వాహ్యాళిపోయెను. రాజునుబట్టి

ప్రజ యన్నట్లు బండివాఁడుకూడ కొన్ని యంశములలో శకారున కీడుజోడే. రాష్ట్రీయుని బండివాఁడ నన్న అహంత వానికి కావలసినంత. వీధిలో పదిమంది బండ్లవాండ్రతో చేరి పైలాపచ్చీసుగ ఏదో ప్రసంగములు వెటకారములు చూపుచు బండిమాటయే మఱచిపోయెను.

రదనిక గుమ్మము తలుపు తెఱచి అమ్మా! ఇదిగో యని వసంతసేనకు బండి చూపెను. రివ్వున ఆమెయు వచ్చి తనకే ఆ బండియని తలంచి చక్కఁగా ఎక్కి కూరుచుండెను. అమ్మా! సెలవని పలికి రదనిక ఏదో తొందఱ పనిలో లోనికిఁ బోయెను. బండి బరువెక్కుటఁ జేసి ఎద్దులు బరబర పోవసాగినవి. గవుసెన క్రిందికి వేసియుండుటచే లోపలివారు కానరారు. చప్పుడు విని బండివాఁడు తటాలున వచ్చి నొగలపై కెక్కి కూరుచుండి లోపల ఎక్కిన దెవరో-ఆచూకియే తెలిసికొనక జీర్ణోద్యానము వైపునకు బండి తోలుకొని పోయెను. చారుదత్తుని ఆనతిచే తోఁటకే ఈ బండి పోవుచున్నదని పాపము! వసంతసేన భావించి భావతరంగములలో ఊయేల లూఁగుచుండెను.

ఇంతలో చెఱసాలలో వింతలు పుట్టెను. ఆరేయి - చెఱసాలలో ఆర్యకుని బంధించి బలమైన

కత్తి చేతఁబట్టి వీరకుఁడు వేయికన్నులతో కనిపెట్టుకొని కూరు చుండెను. ఆవల వసారలో విచ్చుకత్తులవారు హెచ్చరికలు సేయుచు కనుగలిగి కాఁపుదలలో మెదలుచుండిరి. గజదొంగలకు సైతము మా చెఱసాల దుర్భేద్యమై బీతు గొలుపుచుండును. దానిలో అడుగుపెట్టినది మొదలు ఆర్యకునకు ప్రాణముల మీఁది యాశయే లేదు. గుండె పగిలి తిండియైన ముట్టక అల్లే పడియుండును. శర్విలకుఁడు జీవించియుండఁగా తన కీకర్మము రాదని గట్టి నమ్మకమే కద్దు. కాని, వానిని ముందే హత మార్చి ఈ పని చేసియుందురని పెద్ద యనుమానము. బంధీకృతుఁడై వీధిలో వచ్చునపుడు వంచిన తల యెత్తలేదు. తన్నుఁగూర్చి అత్తటి పౌరు లేమని భావించుచుండిరో సూచనగానైన గుర్తింపఁ డాయె. గొల్లల కాఁపరియై స్వేచ్ఛా విహారియై సుఖముగా బ్రదుకు తనకు — ఈ దురవస్థ రానేల? రాచఱికము కావలెనని కోరుకొంటినా? రాజ్యము లేలవలెనని ఊరేగితినా! ఏ సెలయేటి నీటినో త్రావి ఏ మ్రానినీడలోనో పరుండి ఏ తాపత్రయము లేక హాయిమెయి కాలము గడపు నా కీ దుర్దశ రానేల? మున్ను నే నెవ్వరికి ఏయపకారము చేసితినో! ఇక-తరువాయి మరణదండనమే గదా! ఛీ! పాడు జన్మము. అని యా రేయి తెల్లవాఱు లొక్కఁటే బెంగలో క్రుంగి బెగ్గడిలి కూలిపోయెను. మతియే పోయెనేమో!!

శర్విలకుఁడు సహస్రాక్షుఁడై పొంచిపొంచి సర్వము కనిపెట్టి కావలివాండ్ర కన్నులు గప్పి ఆ రేయియే ఆర్యకుని విడిపించెను. కోటలో పెద్ద కోలాహలము చెలరేఁగి నలువలంకులు వ్యాపించెను. ఎక్కడివా రక్కడ దూఁకిరి. ఎవరిపనిలో వారు పరువులు త్రోలిరి. నాలుగు బాటలు – ఆఁకట్టిరి. కోటకొమ్మలపయి నిలిచి రాజభటులు వీధులవంక – చూపు లొఁయ కనుగలిగి కంటిపాపలు తీయుచుండిరి.

ఆర్యకుఁడు శర్విలకుని సాయమున తప్పించుకొని వీధిలోఁ బడెనేగాని – ఆవల నిర్వారును గలసికొ లేకపోయిరి. గుండె బెదరుతో ప్రక్కచూపులతో గలగలలాడు కాలి సంకెలలతో ఆర్యకుఁడు త్రోవ గానక నాలుగు దిక్కులు నెమకెను. కాని పాప మాతనికి దాఁగియుండుటకు తావే కానరాలేదు. రక్షకభటులలో ఒక్కఁడు వాని వెంటనంటి వానిజాడ కనిపెట్టుచునే యుండెను. ఇంతలో – ఆకస్మికముగ ఆ వీధిలో తలుపు తెఱచియున్న చారుదత్తుని యింటిలో ఆర్యకుఁడు దూఱెను. అది చారుదత్తుని యిల్లు గావున గబాలున ఆ రాజభటుఁడు లోనికి పోనేరక ప్రక్కవాటుగా పొంచి పొంచి వీధిలో నక్కియుండెను.

ఇంతలో వర్ధమానకుఁడు వసంత సేనకయి వాకిటిముందు బండి నిలఁబెట్టి నొగలపైఁ గూరుచుండి పరధ్యానములో మునిఁగియుండెను. అదే సమయ మనుకొని ఆర్యకుఁడు గబాలున లోపలినుండి దూఁకి గుమ్మము ముంగల బండిని జూచి బ్రదుకు జీవుఁడా యని వెనుకనుండి బండిలోఁ దూఱి గవుసెన క్రిందికి దించి గుట్టుగఁ గూరుచుండెను. సంకెల గలగలలు విని అందెల రవళియే యని వర్ధమానకుఁ డెంచి – ఇప్పటికే ఆలస్య మాయెనని యెద్దుల నదలించి చెరచెర బండి త్రోలుకొని రాజవీధిలో పోవుచుండెను. వర్ధమానకా! వర్ధమానకా! బండిని - ఆఁపవయ్యా యని లోపలినుండి రదనిక వచ్చి గొంతెత్తి అఱచినదిగాని – ఆ సందడిలో - ఆ తొందఱలో బండివాని కా సన్నని గొంతు వినపడనే లేదు. వేగముగాఁ బోవుచున్న ఆ బండి వీధి మలపు తిరుగనే తిరిగెను. లాభము లేదని రదనిక లోనికిఁ బోయి అమ్మా! బండి – దాఁటి పోనేపోయినది. ఈ నగల మూట మీ సన్నిధినే యుండనిండు. రేపు మైత్రేయునిచే పంపవచ్చును. అని యా మూట యామె కీయఁబోయెను. అయ్యో! ఎంత పని చేసితివే? ఆలోచన లేకపోయెనా! ఆ బిడ యింటికి నగలు లేనిమాట నీ వెఱుంగవటే! పైఁగా – ఉద్యానవనవిహారమా? ఆయనగారు – ఏ మనుకొందురో! మొదటనే పిల్లవానికి ఎందులకు పెట్టనిచ్చి

లివి ? పోసీ ! ప్రయాణమందైన – ఈ మాట గుర్తింపవలదా ? అని ధూతాంబ యెంతో నొచ్చుకొని పలికెను. రదనిక ఆమె శీలమునకు ముక్కుమీఁద వ్రేలువెట్టుకొని, అమ్మా ! ఎందుల కమ్మా ! ఇంతగా విచారపడెదవు ? వసంతసేనమ్మకు ఈ నగలా శోభ తెచ్చిపెట్టునవి ? సహజసౌందర్యము ఉట్టిపడువారికి నగలు – నాణెములు కావలయునా ? మాట వరుసకు – అడిగెదను ; నగలు లేనంతమాత్రాన మీ యంద చందములకు లోపమేమైన కానవచ్చునమ్మా ! అని సమయోచితముగా పలికి ఆ ప్రసంగమే మార్చివైచెను.

ఇక్కడ వీధిలో వర్ధమానకుని బండిని – ఇరువురు రాజభటు లటకాయించిరి. అందులో ఒకఁడు వెనుకటి వీరకుఁడే. రెండవవాఁడు వాని మిత్త్రుఁడు చందనకుఁడు. నాలుగు వైపుల గాలింపుఁడని నలువురను వీరకుఁడు కాఁపుంచి తాను స్వయముగా చందనకునితో రాజవీధికే వచ్చి పొంచియుండెను. కూరగాయల గంపలను సైతము దించి చూచి పంపును. చందనకా ! ఆ బండి యెవరిదో చూడవోయి ! యని వీరకుఁడు ఆజ్ఞవెట్టెను. అయ్యా ! ఈ బండి చారుదత్తులవారిది. దీనిలో వసంతసేనమ్మ ఉన్నది. పుష్పకరండకము దాఁక పోయి రావలెను. అని వర్ధ

మానకుఁడు ముక్తసరుగా విన్నవించెను. ఆనాయికా నాయకుల చరిత్ర ఎఱింగినవాఁడు కావున చందనకుఁడు నిజమే యనుకొని పట్టుపట్టలేదు. రాజకార్యముల పట్టున తండ్రినైనఁ జూడ రాదను తత్త్వము కల వీరకుఁడు శోధింపక బండిని బోనీయ రాదని గట్టిగా మూదలించెను.

సరే! తప్పదా యని చందనకుఁడు బండి యెక్కి గవుసెన యెత్తఁగా శరణాగతుని రక్షింపవా యని ఆర్యకుఁడు వేఁడుకొనెను. ఔరా! గట్టి చిక్కే వచ్చిపడెను!! చందనకుని డెందమా వెన్నవంటిది. అస లా నౌకరికి వీఁడు తగనేతగఁడు. పైఁగా శర్విలకుఁడు వీనికి నేస్తగాఁ డాయె. వాని మిత్రుఁడు—ఆర్యకుఁడని వీఁ డెఱుంగును. వాఁడే వీఁడని బోధపడెను. ఆర్యకుఁడు పాపము! నిరపరాధియే యని చందనకునకు తెలియును. కాని యీవల భయంకరమగు రాజనియోగము. స్వామిద్రోహికి నరకము తప్పదేమో యని బెంగ; మిత్రద్రోహికి చిత్తశాంతి దొరకదేమో యని దిగులు. ముందు నుయ్యి—వెనుక గొయ్యి. పోనీ! నరకమే రానీ మిత్రునే ముమ్మాటికి రక్షింతు నంచు చందనకుఁడు నిర్ణయించుకొని బండి దిగి—ఈవలకు వచ్చెను.

బండిలో నున్న దెవరోయి యని
వీరకుఁడు వెనుకకు వచ్చి యడిగెను. ఆ తొందఱలో - ఆతఁ
డొకటి అనఁబోయి వేఱొకటి తబ్బిబ్బుగా పలికెను. ఆమాట
లకు వీరకుఁ డనుమానపడి నిగ్గఁదీసి యడుగుచు, నీ మొగము
మాఱిపోయినది; జాగ్రత్తసుమీ! ఇది రాజనియోగ మని
కచ్చితముగాఁ బలికి మందలించెను. అనుమానమే లేదు; నా
మాట నమ్మవలె. బండిలో నున్నది వసంతసేనయే యని
చందనకుఁడు మొఱాయించెను. కాదు చందనకా! ఏమైన
సరే! నేనుగూడఁ జూచికాని బండిని పోనీయ నని వీరకుఁడు
ముందునకు నడచెను. అయ్యో! ఆర్యకుఁడు పట్టువడునే యని
చందనకుఁడు బెగ్గడిల్లెను. సరే చూతమని తుదికి రాటు
దేలి కథారంగమును కయ్యములో దించెను. నేను చెప్పి
నది చాలదా! నీవేల మఱల చూడవలెనని చందనకుఁ
డెదురు తిరిగెను. నాకు నీమీఁద నమ్మకము లేదు; మనమున్నది
రాజుకొలువులో. రాజాజ్ఞ నుగ్రాజ్ఞ. రాజద్రోహికి గతులు
లేవు, అని యేవేవో నీతులు వీరకుఁడు ఉపన్యసింపఁదొడఁగెను.
రాజు చన విచ్చెనని త్రుళ్లిపడెదవేమిరా! నీ కుల మేమి!
గోత్ర మేమి! నీ బ్రదు కెంత! నీ అబండార మెంత? అని
చందనకుఁడు వానిని విదిలించెను. మాటలు ముదిరి కలహ
ములో దిగెను. చేతుల్లు జోరుగ కలసినవి. చందనకుఁడు

శారీరకముగ బలిష్ఠుఁడు; వీరకుఁడు నౌకరిలో వరిష్ఠుఁడు. ఇద్దఱకు గ్రుద్దులాటలు పెరిఁగి రసాభాస మయ్యెను. పెనఁగులాడిరి; కలియఁబడిరి. ఇంతలో బండి పోనేపోయినది. జనము వింతగా మూఁగిరి. అందఱు చూతురేగాని ఒక్కఁడును విడిపింపఁడాయె. పైఁగా - వారందఱు రక్షకభటులైరి. ఎవరి కేమి పట్టినది? కొందఱు వీరకునిదే తప్పనిరి; కొందఱు చందనకుని గూర్చి సందేహించిరి. గ్రుద్దులతో నిర్వ్యారును - అలసి సొలసి తిట్లతో శేషము తీర్చుకొనసాగిరి. వీరకుఁడు వయితొలఁగి చూడరా నా దెబ్బ! దివాణములోఁ జెప్పి నిన్నేమి చేయింతునో! అని కారాలు మిరియాలు నూఱి తల పంకించి యుంకించి తన దారిని దాను బోయెను.

చందనకుఁడు కొంతవడికి బండి వెంట వచ్చి, చందనకవీరకులు చూచి విడచిరని అడిగినవారికిఁ జెప్పుమని వర్ధమానకుని హెచ్చరించి తా నిట్లు తలపోసెను:—
ఓహో! కొంప మునిఁగినది. శర్విలకునికోసమై ప్రధానదండనాయకునితో కలహామే తెచ్చుకొంటిని. ఈ రగడ వెంటనే వీఁడు పాలకుని చెవిలో ఊఁదఁగలఁడు. ఇఁక నే నిక్కడ నిమిషముండరాదు. నా చుట్టాలతో నా నేస్తగాండ్రతో కలసి ఆర్యకుని పక్షమందే చేరితీఱవలెను. అని నాఁటితోనే నౌకరికి తిలోదక మిచ్చి ప్రచ్ఛన్నవృత్తిలో - ఆతఁడు మెలఁగసాగెను.

పుష్పకరండక జీర్ణోద్యానములో చారుదత్తుఁడు మైత్రేయుఁడు వేడుక పుచ్చుచుండిరి. తోఁట యంతయు ప్రాఁతగిలిపోయి చారుదత్తుని దారిద్ర్యమునే స్ఫురింపఁజేయుచుండును. ఒకనాఁటి పెద్ద మ్రాఁకులు నేఁడు మోడులై ఉస్సురనిపించును. రాలిన పూవులు తీయువారే లేక ప్రోవులు ప్రోవులుగా పెరిఁగిపోయెను. క్రోఁతులు కొండముచ్చులు కొమ్మలమీఁద గోరాడుచు పారాడుచు పరుగిడుచుండును. పాదులు త్రవ్వి నీరు వోయు పద్ధతియే బొత్తిగ కానరాదు. ప్రకృతియే అనుగ్రహించి ఆ తోఁటను మవ్వముగా పెంచుకొనుచున్నది.

ఇర్వురు — అందందు విహరించుచు మాటయు మంతియు చెప్పుకొనిరి. ఒక్కయెడ — చారుదత్తుఁడు శిలాతలమున చేరగిలఁబడి వసంతసేన రాలేదేమా యని ఉత్కంఠతమై నడుగును. రావలసిన వేళయు దాఁటిపోయె. మదిలో ఆందోళనము పెరుఁగసాగెను. మిత్రమా! వర్ధమానకుఁ డేల ఆలసించినట్టు? మెల్లగా నడచు ఏ బండి వెనుకనైనఁ జిక్కి మనబండి యుండవలసి

వచ్చెనా! చక్రమేమైన జాఱియుండునా! ఇరుసు విఱిగి పోయెనా! బండిపట్టాలు తొలఁగెనా? దారి తప్పెనా? అని యేవేవియో ఊహాలు అల్లికబిల్లికగా పడుగుపేకలుగా పెనవైచుకొని ప్రోదియగుచుండ - మైత్రేయునితో ముచ్చటించును. వాఁడేదో ఆకున కందనివియు పోకను పొందనివియు - తోఁచిన హేతువులు వక్కాణించును.

అప్పుడేదో ఒక బండి వచ్చుచున్నట్లే వారికి తోఁచినది. కాని యా బండి ఈ వంకకు తిరుగనేలేదు. పైఁగా నాగలపై నున్న మానిసి వర్ధమానుఁడును గాదు. శకారుని బండివాఁడని చారుదత్తుఁడు గుఱుతించి, మైత్రేయా! నేఁడు రాజస్యాలకుఁడు సైత మీతోఁటకు వచ్చెను గాఁబోలు నని యూహించి పలికెను.

ఇంతలో మఱొక బండి రానే వచ్చెను. బండిమీఁది వర్ధమానకుని జూచి వసంతసేనయే వచ్చెనని చారుదత్తుఁడు ముచ్చటపడెను. వసంతసేనను దింపవయ్యా! మిత్రమా! యని మైత్రేయుని చారుదత్తుఁడు నియోగించెను. ఒకరు దింపవలసిన అక్కఱ యేమి? కాళ్ళకు సంకెలలు వేయలేదుగదా! యని మైత్రేయుఁడు విరసముగా పలికి బండియొద్దకుఁ బోయి గవుసెన పైకెత్తి చూచి నివ్వెఱపడి

వచ్చి వసంతసేన కాదయ్యా బాబు! వసంతసేనుఁడే ఉన్నాఁడయ్యాయని కడుపు చెక్క లగునట్లులు నవ్వెను. ఓహో! ఎప్పుడును పరిహాసమా! పాపము, బండిలో ఆపెకు కాళ్ళు గుదులుపట్టి యుండునే. దింపవయ్యా దింపు. అని చారుదత్తుఁడు హెచ్చరించెను. అయ్యో! బాబూ! వసంతసేన కాదయ్యా స్వామీ! యని మైత్రేయుఁడు గట్టిగా నొక్కి రాగము తీసెను. అంతయు నాతని వేళాకోళమే యని చారుదత్తుఁ డెంచి చిరాకుపడుచు తానే బండికడకు పోయి గవుసెన యెత్తెను. శరణు శరణని హీనస్వరము బండిలో నుండి వినవచ్చినది. శరణాగతునకభయ మని చారుదత్తుఁడు మాట యిచ్చి లోపలికి తొంగిచూచి, అయ్యా! మీ రెవ్వరయ్యా! అని యాదరించి యడిగెను. ఆర్యకుఁడను; గోపాలకుఁడను; ఆపదలోఁ జిక్కియున్నాను. నన్నుద్ధరింపను మీదే భారమని ఆ మానిసి విన్నవించెను. ఓహో! వ్రేపల్లెనుండి రప్పించి చెఱసాలలో పెట్టించినది మీరయ్యా! సరే, అర్థమైనది. భయపడవద్దు. వర్ధమానకా! రావోయి యిటు, సంకెలలు ఊడఁగొట్టుమా యని చారుదత్తుఁ డాజ్ఞాపించెను.

ఆర్యా! కాళ్ల సంకెలలు ఊడఁదీయించి స్నేహశృంఖలలు తగిలించితిరే? శాశ్వతముగ

నీ వాకు కృతజ్ఞుఁడను. ఆపదలోఁ జిక్కి ఏ సాధనము లేక మీ బండిలోఁ జొచ్చితిని. మీ ప్రియురాలిని దీసికొని రావలసిన బండియని యిపుడు నాకు తెలిసినది. క్షమింపవేఁడెద నని ఆర్యకుఁడు వినయము చూపి పలికెను. ప్రియాసమాగమము కన్న – ఆపన్న రక్షణమే ముఖ్యమని చారుదత్తుఁడు నిబ్బరముగ పలికి వానికి వలసిన సదుపాయములు చేసెను. సెలవా! అని ఆర్యకుఁడు బండి దిగఁబోయెను. కాదని యాతఁడు – ఆతనిని బండిలో నుంచి, వీరు పొమ్మన్నచోటికి బండిని పోనిమ్మని సేవకుని కాజ్ఞ యిచ్చి జాగ్రత్తసుమీ! యని హెచ్చరించెను. మీ మేలు మఱచిపోలే నని ఆర్యకుఁ డెంతో అభినందించి ఆనందించి ముదల గైకొని బండిలో పోయెను.

ఇస్సీ! ఇది రాజద్రోహము మప్పిన ఘట్టము. రాజ్యమా! ఉల్లోల కల్లోలమై ఆభీలమై బీతు గొల్పుచున్నది. ఏ పుట్టలో ఏ పామున్నదో ఎరి కెఱుక? ఏ గోడ కే చెవు లున్నవో ఎవ రెఱుంగుదురు? పోనీ! వసంతసేన రాకపోయినమానె!! ఆర్యకుని ప్రాణములు నిలిచిన వంతే చాలు !! అంతకన్న పుణ్యము పురుషార్థము వేఱున్నదా? పోనీ! మఱొకబండి చేయించుకొని వసంతసేన రానేవచ్చును. కాని, రోజులు మంచివి కావు. ఎందులకో ఎడమ కన్నదరు

చున్నది. పోవుదమా మిత్రమా! అని చారుదత్తుఁ డనఁగా — శాక్యభిక్షుఁ డొక్కఁ డెదురై అపశకునము తెచ్చిపెట్టెను. దాని కాతని గుండె దడదడ కొట్టుకొనెను. ఏమైననుగాని సాయంకాలముదాఁక చూచి పోదములే యని చారుదత్తుఁడు తుదికి నిశ్చయించి అక్కడనే మకాము పెట్టెను.

## ఎనిమిదవ ప్రకరణము

ఆశ్రమస్వీకారములో - ఈ శాక్యభిక్షుఁడు క్రొత్తమానిసియే యగుఁగాక; పూర్వాశ్రమమునుబట్టి మనకు పాతవాఁడే. ఒకనాఁడు వసంతసేనమూఁలాన మానాభిమానములు దక్కి- బౌద్ధసన్న్యాసియై, వెఱ్ఱియేనుఁగు బారిని బడ్డ రోహసేనుని బ్రదికించిన సాహసికుఁడు - ఈ శాక్యభిక్షుఁడే. శిరస్సు ముండితమైనను నుదురు వచ్చుఁదనము మాయనేలేదు. కాషాయవస్త్రపు రంగు - ఒంటికి - ఇంకను పట్టనేలేదు. క్రొత్తగా సన్న్యాసము పుచ్చుకొన్నవాఁడని వీని మొగము - వీని నడక చెప్పకయే చెప్పుచున్నది. ఇంద్రియము లన్నవి ఏవురు దొంగలఁట; చిత్త మనువాఁడు వారికి రాజఁట. వారి బారిని బడకుండ ధర్మమార్గములో మెలఁగవలె నన్న బుద్ధుఁడే రక్షకుఁడఁట. బుద్ధదేవునే ఆశ్రయింపవలెనఁట; అప్పుడుగాని తరింపమఁట- అని, ఈతఁడు క్రొత్తగా నేర్చిన పలుకులు పలుకుచు - ఆ పుష్పకరండకములో కొలను చెంగటగా పోవుచుండెను. ఆఁగవోయి - ఆఁగు! బౌద్ధసన్న్యాసీ! యని తోఁటలో శకారుఁడే కేకపెట్టెను. అన్నా! ఇంకేమున్నది? పిలిచిన దీతఁడా? అయ్యయ్యో! పరమదుర్మార్గుఁడే!! వీనికంటఁబడి బ్రదు

కదా ? బుద్ధభగవానుఁడే నాకిఁక దిక్కని చేతులు కట్టుకొని గజగజ వణఁకుచు అక్కడనే స్తబ్ధుఁడై నిలువఁబడిపోయెను.

### శకారుఁడు - వాని నెచ్చెలి

జంబుకుఁడు వడివడిగా అచ్చటికే వచ్చిరి. ఏమిరా ! సన్నాసీ ! గుడ్లగూబవోలె కన్నులు పెట్టుకొని ఒకే మొగిని చూతు వేమిరా యని శకారుఁడు పండ్లు పటపట గొఱికి - ఏవేవో కాఱుకూఁతలు కూయుచు చేయి చేసికొనసాగెను. నీకు కాలజ్ఞానము ఉన్నదిరా ? భూతభవిష్యత్తులు తెలియునటరా ? అని అడుగుచు ఒక తన్ను తన్నెను. అయ్యో ! బుద్ధభట్టారకా ! నాకేమియు తెలియదయ్యా ! నా దారిని నన్నుఁ బోనీయువయ్యా ! అని వాఁడు చేతులు మోడ్చును; జోతలు వెట్టును; నెత్తిని నోరు వెట్టుకొని మొత్తుకొనును. తెలియనివాఁడవు రానేల ! నా తోఁటలో తిరుగనేల ? నా కంట పడనేల ! అని యాతఁడు మఱిమఱి మీఁదికి పోవును. స్వామీ ! కావిగుడ్డలు ఉదుకుకొనుటకయి వచ్చితినయ్యాయని ఆతఁడు చెప్పుకొనెను. ఓరీ నిర్భాగ్యుఁడా ! ఎంతపని చేయఁబూనితివిరా ! నాపేరు చెప్పిన - నింగిని బాఱు పిట్టసైతము క్రుంగిపోవునే ! నీరు త్రావు బెబ్బులిసైతము నిలిచిపోవునే !! అవురా ! నీకెంత పొగరురా ? నా తోఁటలో నా కొలనిలో గోఁచిగుడ్డలు ఉదికెదవటరా ?

అని వాఁడు వానివీఁపుమీఁద దడదడ మ్రోగించెను. జంబుకుఁడు అడ్డుపడి శకారుని బతిమాలి భంగపడి ఏవేవో మాయలు మాటలు చెప్పి ఉపాయముగా వానిని దప్పించి సశ్శాలిని ఆవలకు తీసికొని పోయెను,

అప్పటికి మట్ట మధ్యాహ్నమై సకలజీవులు తుకతుకలాడుచుండెను. దట్టమైన కొమ్మలలో గుట్టగా దాఁగిన పిట్టలుసైతము బయటికి తొంగిచూడవు. నింగిని వేవెలుంగు విహారము సేయుచు ప్రతాపము జోరుగ చూపసాగెను. తిండికి వేళదప్పి ఆఁకట నకనకలాడుచు శకారుఁడు అవురావురుమని, పల్లటిల్లి బెగడిల్లి బండికోసము దారి చూచును. స్థావరకుఁడు బండి తేలేదేమని మఱింతగా మండి పడును. సరససల్లాపములు సన్నగిల్లి చచ్చిన చావయ్యె. ఇంటికి నడచి పోదమన్న - మిన్ను మన్ను ఏకమై మంట మీఁది పెనమువోలె మండిపోవసాగెను.

కొంతవడికి స్థావరకుని బండి రానేవచ్చెను. పట్టుకొని వానిని అప్పాట మ్రింగవలెనన్నంత పట్టరాని కోపము శకారునికి కలిగి ఎందులకో తమాయించెను. తలయు తోఁకయు లేని వికారపుఁజేష్టలు పెక్కులు చూపి బావా బండి యెక్కవయ్యా! యని జంబుకుని ముందునకు

త్రోసె. ఓరీ! నీ యిల్లు వెల్లకాఁడుగాను - అని క్రుక్కినవేమ
వారె లోలోన బెగ్గడిల్లి సరేయని జంబుకుఁడా బండి యెక్కఁ
బోయెను. ఓరీ! ఈ బండి నీ యబ్బదంటరా! నీ తాతదంటరా!
దిగవోయి దిగు; ఈ బండి నాది. నేనే ముందెక్కవలె. నేనెవ
రనో తెలియదా! అని యా వెట్టివెంగళప్ప వానిని జబ్బ పట్టి
క్రిందికి లాగెను. శకారుని వాలక మెఱింగియు జంబుకుఁడు
చిరాకుపడుచు హతాశుఁడై నిలిచిపోయెను. తగుమనమ్మాత్రి
యని తెయితెక్క లాడుచు బండి పిఱిందికి శకారుఁడు పోయి,
సరిగా - ఎడ్లను పట్టవోయ్! ఇదిగో ఎక్కెద! నని స్థావరకుని
హెచ్చరించి ఎగిరి బండి యెక్కి గవుసెన తీసి చూచి గబాలున
క్రిందికి దూఁకెను. అమ్మో! బాబో! దయ్యమని జంబుకుని మెడను
మెలివైచి పట్టుకొని, చచ్చితిని; చచ్చితిని. దయ్యమో దేవ
రయో_భూతమో ప్రేతమో బండిలోఁ దూఱినది. ఇంక నేను బ్రదు
కుదునా! పుడమిపై తిరుగుదునా? అయ్యో! కర్మమా! యని
కుయ్యిడఁజొచ్చెను. ఎండవేళ ఏదో భ్రమించితి వని నెచ్చెలి -
ధైర్యము చెప్పెను. కాదు బావా! నీవుకూడ చూడుమని
వానిని ముందునకు త్రోయఁగా - ఛీ పాడుకొలువురా! యని
జంబుకుఁడు - ఏవగించుకొని బండి యెక్కెను. శరణు శరణని
లోపల - ఆఁడుగొంతు వినవచ్చె. నిదానించి చూచి ఆమెను
గుఱుతించి అయ్యో! పిచ్చిదానా! ఇట్లు వచ్చితివేల? రాజ

హంసికి మాలకాకి పాత్రేల? తల్లిపోరు పడలేక వచ్చితివో యేమో! అని యా జంబుకుఁడు అనుమానించి యడిగెను. డేగబారిని బడ్డ పావురమువోలె పులినోటఁ జిక్కిన కురంగి వడువున వడవడ వడంకుచు నిలువెల్ల నీటిముద్దయై వసంతసేన గుండె గుబేలుమన బెగ్గడిల్లి రాపడి అట్టె చూచుచు సర్వము వివరించి కాపాడవా యని కన్నీరు పెట్టుకొని వేడుకొనెను. ప్రయాణములో పొరసిన ప్రమాద మిది యని జంబుకుఁడు కనిపెట్టి భయపడవలదని ఆమెకు అభయమొసంగి బండి దిగి శకారునివద్దకుఁ బోయి, స్యాలకా! అందున్నది భూతమే సుమా! రమ్ము రమ్ము నడచిపోదమని గడగడ వడంకెను. నీవు దానితో మాటలాడితివయ్యా! నీవు బ్రదికి యున్నట్లే గదా! పోనీ దానినే పాఱఁద్రోలి మన బండి మనమే యెక్కుద మని శకారుఁడు ముందడుగు వైచెను.

అయ్యో! ఆపద వచ్చెనే యని జంబుకుఁ డేవో మాయలు పన్నఁదొడంగెను. శకారుఁడు వెటకారపుఁ గూఁతలతో పిఱిఁది కొకసారి పోవును; ముందున కొకసారి సాగును. దయ్యమే బండిలో ఉండెనా బండినే కాల్చివైతునని ఎండుపుల్లలు తెప్పించి నిప్పు రగిలించి దానికి సిద్ధమాయె. గబాలున గవుసెన యెత్తి గల్లు గల్లుమను సవ్వ

డెత్తో తటాలున వసంతసేన బండిలోనుండి దూఁకెను. నిదానించి ఆమెను ఎగాదిగ చూచి ఆ నీచుఁడు, ఓహో! వసంతసేనవో అనుచు గంతులు వేయఁజొచ్చెను. నన్నే వలచితివా! నా ప్రియా! కుబేరునికొడుకు నరకాసురునికోసమై మేనకాదేవి వచ్చినట్టులు నాకోసమే నీవు వచ్చితివా? నా భాగ్యమేమి? నా జన్మమేమి? అని యుబ్బితబ్బిబ్బు లగును. మొగము వంచుకొని జంబుకుఁడు విచారములో బ్రుంగి క్రుంగిపోయెను. తడి యారిన పెదవులతో బెదరిపోయిన కన్నులతో గడగడ వడఁకు ఒడలితో అడలిపోవు ఎడందతో ఆవల - ఒక ఓరగా వసంతసేన నిలువఁబడిపోయెను. నీచుఁడు శకారుని చేష్టలు - ఎట్టివని చెప్పుము? ఒకవైపు కనుగీఁటులు; ఒకవంక వ్రేలిమీటులు; ఓహోహో! అని యరచుచు మీసము మెలివేయును; తొమ్ము విరుచుకొనును, గొంతు సకిలించి వండ్లు - ఇగిలించును. ఒక్కటే మొగిని మర్కటపుఁజేష్టలు హద్దుపద్దు మీరి వింతగా చెలరేఁగెను.

వసంతసేనా! వసంతసేనా!

నన్నే వలచితివా యని ఆమె సన్నిధికి చేరఁబోవును. సరససల్లాపములలో వికారపుఁజేఁతలలో మునిఁగిపోవును. ఆ వైఖరికి వసంతసేన సాసూయయై బిట్టుగ వాని నిసడించెను. దానికి పట్టరాని

కోపము వచ్చి ఎక్కడ కొరకెరా నీకిది యని బండివానిని గొట్టఁబోయెను. త్రోవలో చారుదత్తుని యింటిముందు బండీ యాఁపి యుండఁగా చారుదత్తుని బండియే యనుకొని ఈమె యెక్కియుండవచ్చు నని స్థావరకుఁడు విన్నవించెను.

ఓసీ! నీ సిగ దఱుగ!! బండీ మాఱుదలవలన వచ్చితివే గాని కడుపులో వలపు లేదన్న మాట. చక్కఁగా నా బండి యెక్కి చారుదత్తునికడకు పోవల నని ఎత్తువేసితివా? అని చిఱ్ఱుబుఱ్ఱుమని చఱ్ఱున నీఁదికి వచ్చెను. ఆ మాటలో కొంతవట్టు నిజమే యున్నది; బుద్ధి పూర్వకముగ నీ బండి యెక్కి రాలేదని నిర్భయముగ వసంత సేన సమాధాన మిచ్చెను. దానితో — ఆతని కోపము ఒడ్డు లొరసి, తనకుఁగాని వస్తువు మాసిపోవుటే మంచిదని యెంచి నిన్ను చంపింతును జూచుకోయని ఆమెను బెదరించెను. దానికి ఆమె జంకదు; రవ్వంతయు నాతని మెచ్చదు. చూచి చూచి ఛీయని రోసి వాఁడు, బావా! దీనిని గఱకఱ గోసి కాకులకు వేయుమని ఆనతి వెట్టెను, హరి హరీ! యని జంబుకుఁడు అదిరిపడి చెవులు మూసికొనెను. ఏమయ్యా! బావా! నా మాట వినవా! నా బంగారుబావవు. కన్నులలో పెట్టు కొని నిన్ను పూజింతునని మఱి మఱి గడ్డము పట్టుకొని బతి

మూలుగను. మహాపాతకమని బెదరి జంబుకుఁడు పెడమోము పెట్టి వణఁకఁదొడఁగెను. ఏమిరా! స్థావరకా! నాయనా! బాబూ! నీ సైనఁ జంపవురా! నా మాట నీవు వినవురా! బంగారువస్తువులు చేయించి నీ యొంటికి దిగవైతునురా! అని వానికాళ్లకు మ్రొక్కెను. అయ్యో! కర్మమా! బండిమాఱు దలవల్ల నేను చేసేత చేసిన అకార్యమే చాలక ఈ పాతకము గూడ ఒడిఁగట్టుకొందునా ప్రభూ! నావల్లఁగాదు స్వామీ! యని వాఁడెదురు తిరిగి వెనుకకు పోయెను. ఓరీ విధవా! నా మాట వినవా యని శకారుఁడు వానిని జుట్టుపట్టుకొని నాలుగు గ్రుద్దులు గ్రుద్దెను. చంపవయ్యా! కొట్టవయ్యా! ఏ మైనఁగాని నేనాపని చేయలేను; వెనుకజన్మములో నేఁ జేసిన మహాపాతకమువల్లనే నీ వంటి ప్రభువునకు గర్భదాసుఁడనై ఈ తీరుగ ఏడ్చుచున్నాను. తెలిసియు పైఁగా – ఇట్టివి చేసెదనా పుట్టగతు లుండునా ప్రభూ! అని వాఁడు మొఱాయించెను.

నా కూడు తిని నా మాట వినవాయని నాలుగు గంతులు పెట్టి బండివానిని జావఁజిదుక బాఁది ఆవలకు గెంటివైచి, పోనీ! నేనే యీ తొత్తును జంపెదనని ముందునకు సాఁగెను. జంబుకుఁడు అడ్డుపడి వానిని బడనెట్టి జాగ్రత్తసుమీ! ఈమెజోలికి పోదువా

వాఁడు నాదెబ్బ యని వ్రేలు చూపి రాటుదేలి నిలిచెను. క్రిందఁబడి యాతఁడు మూర్ఛపోయి కొంతవడికి తెప్పిఱిల్లి కోపమ్మాఁపుకొని బావా! బావా! యని వానిని బతిమాల సాగెను. సైఁగా పాపము వాఁడేమయ్యెనో! బండివానిని దీసి కొని రమ్మని పురమాయించెను. ఈనడుమ — ఆబిడను జంపు నేమో యని జంబుకుని యనుమానము. లేదయ్యా బావా! ఊఱక బెదరించితినేగాని వసంతసేనను నేనేల చంపెదను! చంపిన నాకేమి వచ్చును? ప్రాణము తిరిగిపోయె. అబ్బాఁకలి కడుపు పీఁకుచున్నది. నడవలేనయ్యా నడవలేను; బండివానిని దీసికొని రావయ్యాయని కాళ్ళు పట్టుకొని జంబుకుని బతిమాలెను. నిజమే యనుకొని పాపము — అతఁడు మనస్సు కరఁగి జాగ్రత్తసుమీ యని మాత్రము హెచ్చరించి తోఁట గుమ్మము వైపునకు మొగము త్రిప్పెను. అయ్యా! రక్షింపవా నన్నని వసంతసేన వానిని వేఁడుకొనెను. వసంతసేనా! భయపడఁబోకుము. ఇప్పుడే వత్తునని అతఁడభయమొసంగి, స్యాలకా! జాగ్రత్తయని వెండియు హెచ్చరించి నాలుగడుగులు వైచి చెట్టుచాటున నక్కి పొంచి చూచెను. శకారుఁడామెదగ్గఱకుఁ జేరి సరససల్లాపములలో దిగెను. ఆ ధోరణిలో అతనికి హత్యాయత్నమే ఉండనేరదని జంబుకుఁడు భావించి తనత్రోవను దాను బోయెను.

కామియైన శకారుఁడు — ఎన్నో వికారములు పోయి నయాన భయాన ఆమె వలపునకై దోసిలి చాచెను. లవలేశమైన చనవీయక — అతని మాటలు బొత్తిగా సైఁపక వసంతసేన వయిత్తొలఁగి నిలిచెను. దానితో శకారుఁడు పట్టరాని కోపము వచ్చి పండ్లు పటపట కొఱుకుచు మీఁదికి పూఁకి ఆమె గొంతు గట్టిగా నొక్కి పడవైచెను. ఆదెబ్బతో ఆమె అమ్మోయని యఱచి నేలమీఁద వ్రాలి మూర్ఛలో మునింగెను.

తిక్క వదలినదని శకారుఁ డెంచి కళేబరముపోలె కానవచ్చు ఆమె యొంటిమీఁది నగలు తడుముచు — ఈ నేరమి ఎవరిమీఁద ఆరోపింపవలెనా యని పెద్ద ఆలోచనలో పడి ఆమె ప్రక్కనే కూరుచుండెను. స్థావరకుని వెంటఁ దీసికొని జంబుకుఁడు వచ్చెనేగాని — ఆ దృశ్యము చూడఁగా వాని గుండెలో పెద్ద పిడుగు పడెను. అయ్యో! వసంతసేనను వాఁడేమి చేసెనో యని బెగ్గడిలి వాని దరిఁ జేరి స్యాలకా! ఏమి చేయుచున్నావు? ఈమె పడియున్న దేమి యని బిత్తఱపడి యడిగెను. నేను జంపలేదయ్యా! ఈబిడయే క్రింద పడిపోయెను. మూర్ఛరోగ మున్నది కాఁబోలు. అని యాసించుఁ డేదియో బొంకసాగెను. అనుకొన్నంత జరి

ననపని జంబుకుఁడు దరిజేరి ఆమెవైఖరి లెస్సగ — పరికించెను. ఊపిరి యాడదు; నాడి కొరకదు. ఒడలు చల్లనయ్యె. మొగములో కళ తగ్గె. అయ్యో! ఎంతఘోర మెంతఘోర మని అఱచుచు వాఁడును నేల కొఱఁగెను.

తాను జేసినదానికి — ఇద్ద్వరే సాక్షులు. అందులో జంబుకుని అవలీలగఁ జంపవచ్చును. బండివానిమాట లంచముతో తేలవచ్చును. అని యా శకారుఁ డూహాలు చేసిచేసి జంబుకుని దరికి నెమ్మదిగ పిల్లివలె వచ్చెను. అంతలో తెలివి వచ్చి వసంతసేనవైఖరికి వాఁడు తల్లడిల్లుచు — అయ్యో! వసంతసేనా! ఇట్లయిపోయితివా? నీ మంచితన మేమయ్యెనో? నీ త్రిలోకసౌందర్యమైన నిన్నుఁ గాపాడలేకపోయెనా? సిరిసంపదలలో చదువుసంధ్యలలో గుణగణములలో నీవు నోఁచిన నోములు నీవు చేసిన తపస్సు వ్యర్థమాయెనా? నిన్నుఁ జూచుభాగ్య మిఁక ఉజ్జయినీ వాసులకు దక్కదుగదా! కులకాంతలకుసైతము నీవు మేలుబంతివే యని శోక మాఁపుకోలేక బావురుమని యేడ్చెను. నీ యబ్బచుట్టమా! నీ యమ్మచుట్టమా! బావా! ఏల యేడ్తువని శకారుఁడు వాని నూఱడింపసాగెను. ఛీ! నీచుఁడా! నీ మొగము చూడరాదు. ఆఁడుదానిని జంపిన పరమతుచ్ఛుఁడవు

సహోక మానిసివా! చలిచీమనైనను జాఁద్రొక్క శంకించు ఈమెను జంపుటకు నీచేతు లెట్టులాడెనురా! ఈ యుంబాల రాశిని సమసి చిదిమి చీల్చి జీవింపఁగలిగితివిరా! ఓరి పాపీ! కసాయివాఁడవా? కలుకురక్కసివా! నిన్నేమి చేయుదురా! అని అనరాని మాటలెల్ల అని నోటికి వచ్చినట్టులు తిట్టిపోసెను. బావా! నేను చంపలేదు; ఇదియే చచ్చినదని శకారుఁడు వానిని నమ్మింపఁజొచ్చెను. ఛీ! నీ మొగము మండ యని చివ్వున జంబుకుఁడు లేచి నాలుగడుగులు ముందునకు నడచె.

ఓరీ! జంబుకా! ఆఁగవోయి; ఆఁగు. పాప మీమెను జంపి పరారి అయ్యెదవా యేమి? నిన్నేమి చేసెదనో చూడు. పదరా పోదము న్యాయసభ కని శకారుఁడు చావుతెలివి చూపి క్రొత్తయెత్తు – ఎత్తి వానిని పట్టుకోఁబోయెను. జంబుకుఁడు దానికి గుండె యదరి ఒక్క విసురు విసిరి, ఛీ పాపీ! పైఁగా లాఁతివారిమీఁద – అపదూఱు వేయఁజూతువా? నీ తెలివితేటలకు నీ నెఱజాణతనమునకు – ఇదియు తోడాయెనా! నిచ్చలు నీ నెచ్చెలినై ఇన్నాళ్ళు నేఁజేసిన దోసములే చాలు. నీ సాహసము – ఇహపరములకు గొడ్డలిపెట్టు. నీమొగ మిఁక చూడరాదని కస్సుబుస్సు మని తద్దయు రోసి వసంతసేనవైపునకు తిరిగి, సోదరీ! మాటయిచ్చి

నేను నిన్ను రక్షించుకోఁజాలనైతిని. రాఁబోవు జన్మమందైన నీ ఋణము తీర్చుకొందును. నీవిఁక వేశ్యాజాతిలో మాత్రము పుట్టకుందువుగాక!! అని దీనాతిదీనముగ పలికి రివ్వున బోయి కర్యకుఁడే నాకు శరణ మనుచు వానిపక్షమే చేరెను.

ఆవల శకారుఁడు స్థావరకునైన మంచి చేసికోవలెనని ఎన్నో యగచాట్లు పడెను. ఓరీ! ఈ బిడను జంపినది జంబుకుఁడా! నేనా? అని ప్రశ్నించెను. మీరు ఉభయులు గాదు స్వామీ! పాపిష్ఠుఁడను బండిమీఁద వేసికొని వచ్చి నేనే యీ బంగారుతల్లిని జంపుకొంటినయ్యా! అని యాతఁడు శోకములోఁ గుమిలిపోయెను. అట్లని న్యాయమూర్తి కట్టెదుట వినిపింతువురా యని శకారుఁడు అనుమానించి యడిగెను. స్వామీ! అభ్యంతరమేమి! జరిగినది జరిగినట్లే ఎఱింగింతునని వాఁడు సమాధాన మిచ్చెను. ఔరా వీఁడేమైన - ఈ రహస్యము వెలిఁబుచ్చునేమో యని - ఇదిగో బంగారు నగల మూట తీసికోరా యని వాని కాళ్ళ వెట్టెను. వాఁడు ససేమిరా యనెను. సరే పోనీ! బండి తోలుకొనిపోయి ఇంటివద్దనే నా వచ్చునందాఁక ఉండుమని వానిని సాగనంపెను. నగలు తన చేతిలో ఉన్నచో అపాయము రావచ్చునని ఆ నీచుఁడు సంశయించి చప్పున - అప్పుడే తోఁటలో ఒక

మూల త మూలను పాతిపెట్టెను. రెండియు వసంతసేనను తెన్నగా పరికించి ప్రాణము పోయినదనియే రూఢి చేసికొని ఎవ్వరైనఁ జూతురేమో యని ఇవిష్ట యెండుటాకులు ప్రోవుచేసి తెచ్చి ఆ కళేబరమును గప్పివైచెను.

శకారుని బుద్ధి దురాలోచనములో దూఁగుచుండెను. ఈ నేరమిఁ ఎవరిమీఁద పెట్టవలె? జంబుకస్థావరకులకు నేనన్న భయ మున్నది. నేనేమి చేయింతునో యని వారు నాజోలికి రారు. కాఁగా మిగిలియున్నది ఒక్కఁడు చారుదత్తుఁడే. అతఁడా పట్టి దరిద్రుఁడు. అతనికి ఈ బిడకు నేస్త మున్నదని లోక మంతకును తెలియును. ఈ బంగారు నగల కాసపడి నా యుద్యానవనములో అతఁడే ఈబిడను జంపివేసె నని న్యాయసభలో వివాదము తెచ్చెదను. ఆలస్యమైనచో అమృతమే విషము కావచ్చు. మసలరాదని - ఇంటికి రివ్వునఁ బోయి స్థావరకుఁడు సాక్షిగా సంసిద్ధుఁడగునేమో యని తద్దయు సంశయించి వానికి గొలుసులు వైచి మేడ మీఁద బంధించి యుంచెను.

ఇక్కడ తోఁటలో - ఇంతకు ముందు దెబ్బలు తిన్న శాక్యభిక్షుకుఁడు కావిగుడ్డలు ఉదుకుకొని ఆకులప్రోవు ఎత్తుగా ఉండుటచే అందే ఆఱవైచి దగ్గఱలో కూరుచుండి ఏవేవో తలపోయుచుండెను. ఆఱఁబెట్టిన కావిగుడ్డల చలువచే ఆకులలో దాఁగియున్న దేహమునకు రవ్వంత

చైతన్యము కలిగెను. కొంచెము ఊర్పు వచ్చి మూలుగు వినవయ్యె. కొంతవడికి స్వర్ణకాంతి కలిగి స్వర్ణాలంకారభూషిత మైన ఒక చేయి ఆకులలో ఆ భిక్షుకునకు కానవచ్చెను. ఔరా! ఏమిది? నేఁజూచిన హస్తమే యిదియని ఆతఁడు నివ్వెఱనడి ఆకుల నన్నింటిని ఆవలకు త్రోసివైచి ఆమె వసంతసేనయే యని లెస్సగా గుఱుతించి – ఇన్ని నీళ్ళు తెచ్చి ఆమె గొంతులో పోసెను. వలసిన యుపచారములు శ్రద్ధగా వేగముగా భక్తిమై కావించెను. కొంతవడికి వసంతసేన తెప్పిఱిల్లి లేచి కూరుచుండి ఎవరవయ్యా! నీవని వాని నడిగెను. అమ్మా! మున్నొక్కనాఁడు నీయాశ్రయము కోరి వచ్చి మన్ననఁబొందిన సంవాహకుఁడను నేనే. వెఱ్ఱియేనుఁగు బారినుండి రోహసేనుని గాపాడిన భిక్షుకుఁడను నేనే. అని యాతఁడు తన్నెఱింగించి అమ్మా! ఇట్టి కష్టదశ నీకేల వచ్చెనమ్మా యని ప్రశ్నించెను. ఆమెయు ఓపిక చేసికొని పూసగ్రుచ్చినట్టులు సర్వము తెలియఁజెప్పెను. అయ్యో! యని ఆ భిక్షుకుఁడు బిట్టుగ వగచి ఆమెను నెమ్మదిగఁ దీసికొని దగ్గఱలో బౌద్ధమఠములో చేరిచి తానును బౌద్ధసన్న్యాసిని యొక్కర్తుకయు సకలోపచారములు కావింపఁదొడంగెను. క్రమక్రమముగ వారొనర్చు చికిత్స వలన శరీరగ్లాని తగ్గిపోయి నాలుగడుగులు వేయుటకు ఆమెకు ఓపిక చిక్కెను.

## తొమ్మిదవ ప్రకరణము

చారుదత్తుఁడు తోఁటలోనుండి ఇంటికి చేరునప్పటికి చీఁకటి పడినది. వచ్చినదే తడవుగ వసంతసేన యేమైనదని జాడ తీసెను. అయ్యో! బండి యెక్కి ఆమె పుష్పకరండకము నకే పోయెనని రదనిక చెప్పెను. బండివాఁ డెవ్వఁడా యని ఆరా తీసిరి. ఆ వయినము తేలలేదు. ఆమెయింటికే ఆమె పోయియుండు నని చారుదత్తుఁడు ఊహించెను. ఆపద యేమైన వచ్చినా యన్న ఊహయే తట్టలేదు. ఉజ్జయినిలో ఆమెకథను ఎఱుంగని వా రెవ్వరు గనుక? ఒకవేళ త్రోవయే తప్పినా ఊరిలో ఎవ్వరైనను ఆమెను — ఇల్లు చేర్చివత్తురు. కాఁగా — ఆమెపట్ల సంశయింపఁదగ్గవాఁడు — ఒక్కఁడే ఒక్కఁడు. వాఁడు శకారుఁడు. వాఁడేమో నేఁడు తోఁటలోనే ఉండిపోయె. కాని తోఁటలో ఉన్న తనవద్దకు ఆమె ఏల రాలేదు? వలపుబలుపులో పొరపాటు ఊహింతునా? కాదుకాదు. ముందుగ లేచి నేను మాట అనకయే తోఁటకు పోయినందులకు కోప మేమైన వచ్చియుండునా? అదియునుగాదు; ఐనచో ఏమై యుండును? ఇత్యాదిగ — చారుదత్తుఁడు ఏవేవో ఊహాలు వోవుచుండెను.

అంతలో రదనిక వచ్చి బంగారు నగలు తెచ్చి ఆయనమ్రోల కుప్పవోసి ఆ కథ యంతయు విన్నవించెను. సరే! ఈ వంకతో ఆమెయింటికి మనమే పోవచ్చునని చారుదత్తుఁడు నాఁటికి సరిపెట్టుకొని దాఁచవోయి ఈ నగలని మైత్రేయున కిచ్చెను. ఇదే యుద్యోగమా నాకని ఆతఁడు రుసరుసలాడి, ఇవి మనకొంప తీయువుగదా యని సదా ధోరణిలో విసుగుకొనెను.

ఇంతలో తలుపు గ్రుద్దినచప్పుడు వినవచ్చెను. పోయి చూతునా యని లేచి మైత్రేయుఁడు తలుపు తీసెను. గవుసెనలు కప్పుకొని వరుసగా నలువురైదువురు లోనికి వచ్చిరి. అమ్మో! దొంగలు దొంగలని మైత్రేయుఁడు ఊడనిఁబాడెను. దొంగలము కామయ్యా యని వారిలో ఒకఁడు ముందునకు వచ్చి చారుదత్తుని మ్రోల మోఁకరించి జోతలు పెట్టెను. ఆతఁడు – ఆర్యకుఁడే యని చారుదత్తుఁడు గుఱుతుపట్టి మైత్రేయుని బిలిచి భయము లేదని సముదాయించి లోనికి పంపెను. వీరంద ఱెవరని చారుదత్తుఁ డడిగెను. అయ్యా! ఈయనపేరు శర్విలకుఁడు; ఈతఁడు చందనకుఁడు; వీఁడు జంబుకుఁడు; ఇతఁడు దర్దురకుఁడు. అని పేరుపేరున వారి కథాక్రమమును ఆర్యకుఁ డెఱింగించెను. శర్విల

కుని వార్త వింటినని చారుదత్తుఁడు పలికి చందనకుఁడు తలారి యాటచే సంశయము వెలిఁబుచ్చెను. కాదని ఆర్యకుఁడు సంశయము లన్నియుఁ దీర్చి మీ దయ మాకున్నచో మా పక్షమునకు విజయమే నిశ్చయమని అతని అభినందించెను. నేనుగా మీ వ్యూహములో చేరి తిరుగనుగాని మీ జయమే అనారతము ఆశింతునని చారుదత్తుఁడు మాట యిచ్చెను. అదే మాకు పదివేలు; మీ యసమ్మతి లేనిచో ప్రజలందఱు మా పక్షమందే ఉందురని వారందఱు పదింబదిగ అభినందించుచు ముదల గైకొని వచ్చినట్లే గుట్టుగ ఎక్కడికో పోయిరి.

మఱునాఁడు శకారుఁడు వ్యవహార మున్నదంచు న్యాయసభకు బయలుదేఱెను. అంతకు ముందే తలారి వీరకుఁడు వచ్చి అక్కడనే మకాము పెట్టెను. తొలుత నిర్జనముగా నున్న ఆ ప్రాంతము నిశ్శబ్దముగా నున్న ఆ ప్రదేశము క్రిమక్రిమముగ జనసంకులమై కోలాహలముతో నిండిపోయెను. ఒక్కొక్క ఉద్యోగియు వచ్చి న్యాయమంటపములో ఎవరిచోట వారు కూరుచుండిరి. మెలకువ కలిగి తలారులు సంభ్రమముతో బరాబరులు సేయుచుండ న్యాయాధికారి వచ్చి నడుమ నున్న ఉన్నతాసనమును అధిష్ఠించెను. కొంచెము దిగువలో అధికారికి కుడివైపున కరణమును ఎడమ

వైపున శ్రేష్ఠియుఁ గూరుచుండిరి. పిఱిందిదెసను ప్రక్కవాటుగా సేవకుఁ డొక్కఁడు నిలిచి పెద్ద విసనకఱ్ఱతో విసురుచుండెను. సేవకులు మఱికొందఱు నడుములు కట్టుకొని ఎదురెదురుగా నిలిచి యుండిరి. గుమ్మములో తలారులు విచ్చుకత్తులు పట్టి పారా యిచ్చుచుండిరి.

వ్యవహారము లున్నవా రెవ్వరేని రావచ్చు నని శోధనకుఁడు కేక వైచెను.

మందలు మందలుగా ఉన్న ఎందఱినో త్రోసికొని తనకు వ్యవహార మున్నదని శకారుఁడు ముందునకు వచ్చె. ఆ మాట శోధనకుఁడు అధికారులకు విన్నవించెను. అయ్యో! రామా! పిల్లిని జంకఁ బెట్టుకొన్నట్టులు — ఉదయమందే సూర్యగ్రహణము పట్టినట్టులు ముందే వీని వ్యవహారమా! ఎవని కొంప తీయుటకో ఈ ప్రయత్నము? అని అధికారి యించుకంత సంశయించి ఆవల చూతుమని కబురు చెప్పి వేఱెవ్వరైన ఉందురేమో పిలువు మని పంపెను.

ఆ కబురు విని శకారుఁడు తోఁక త్రొక్కిన త్రాఁచువోలె ఎగిరిపడి రుసరుసలాడి కస్సుబుస్సుమని, ఏమేమీ! నా వ్యవహారము చూడరా? మా

యప్పతో జెప్పెదను; మా బావతో జెప్పింతును. న్యాయాధికారి యుద్యోగమే ఊడఁదీయింతును; జాగ్రత్త. అని బిగ్గఱగా అఱచి చిందులు త్రొక్కసాగెను. ఈ వార్త లోపలియధికారి విని ఉపకి వచ్చు కోపమును ఓపికతో అణఁచికొని, వీఁడేదియైన చేయఁగలఁడు. శోధనకా! రమ్మను మని ఆజ్ఞయిచ్చెను.

చూచితిరా నా దెబ్బయని శకారుఁడు మీసము మెలివెట్టి బొర విఱుచుకొని మండపములో చొచ్చి అధికారుల వంకకు తిరిగి మీకు సుఖంబగుఁగాక యని పలికి అంతలో మీకేల నాకే యగుఁగాక యనికుశలప్రశ్నలు జరిపెను. ఔరా! వీని పొగరని అధికారి యేవగించుకొని కూరుచుండుమని సైఁగ చేసి చోటు చూపించెను. ఓహో! నేను కూర్చుండవలెనా! పెఱవారి అనుమతి నాకు కావలెనా? నేనా రాజస్యాలకుఁడను. ఈ దేశమంతయు మా బావగారిది. మా బావగారి వన్నియు మా యప్పవేగదా! మా యప్పవి నావికావా! నా యిచ్చవచ్చిన చోట నేనే కూరుచుందు నని ఆ శకారుఁడు అడ్డమాఁకయు లేక ప్రేలుచు అందే ఒక్కయున్నతాసనమునఁ గూరుచుండెను.

అధికారికి అఱకాలి మంట తలదాఁక వచ్చినది. కాని యేమి సేయఁగలఁడు? కడుపుఁ

గూటికైతే లాంతి వారి కొలువులో చేరినవారి అగచాటు లిట్టివే గదా! పోనీలే! యని కోప మణంచుకొని నీకేమైన వ్యవహార మున్నదా యని శకారుని ప్రశ్నించెను. అవునయ్యా! అవును. నాకే వ్యవహార మున్నది. నేననంగా ఎవ్వరో తెలియునా! రాజస్యాలకుండు; దండపాలకుండు. పేరు శకారుండయ్యా అని వాండు నోటికి వచ్చినట్టులు వదరసాగెను. పక్కన పదిమందియు పగులంబడిరి. సద్దు సేయరాదని నలువంకల సేవకులు గద్దించిరి.

వాది యూరిపేరులు వ్రాసికొను మని అధికారి తన యుద్యోగిని హెచ్చరించెను.

ఏవేవో అవకతవకపు వికారపుం గూంతలు కొన్ని కూసి శకారుండు తన వ్యవహార మిట్టులు బయటపెట్టెను:—

అందఱు శ్రద్ధగా వినుండు.

నా చెప్పినది జాగ్రత్తగా వ్రాసికొందురో లేదో సుమా! అంతయు మీదే బాధ్యత. మా యయ్య రాజుగారికి మామయ్య. అనంగా రాజుగారు మా యమ్మకు అల్లుండన్నమాట. పైగా మా యప్పకు రాజుగారు మగండు, అట్టి చుట్టరిక మున్న ఈ నన్ను మెచ్చుకొని మహారాజుగారు పుష్పకరండక మను ఉద్యానవనము విహరింపవయ్యా! యని ఇచ్చినారు. అందలి

పుష్పాలలో ప్రసూనములలో సుమములలో కుసుమములలో సౌర
భ్యము కన్నులతో జూచి ఆనందింపను నిశ్చలు ప్రోత్సహించును.
సరిగా నిన్న మధ్యాహ్నము నా తోటలో నా కన్నులతో
నేనే స్వయముగా చూచితిని. అబద్ధముగాదు; అసత్యము గాదు.
ఒట్టు వేసికొని మరి గట్టిగా చెప్పెదను.

ఏమిటయ్యా! చూచినదని అధికారి ప్రశ్న !!

ఆముదాని శవము.

అవురా! తలారుల అజాగ్రత్త! అని న్యాయాధికారి అబ్బుర
పడి అది యెవ్వరో పోల్చుకొంటివా! యని శకారుని ప్రశ్నిం
చెను. పోల్చుకోలేకపోదునా ఎవ్వరో కాదు; సరిగా వినుడు.
ఈ నగరమున కంతకు అలంకారమై ఒంటినిండ బంగారునగలు
తొడిగి ఒప్పులకుప్పయై కన్నులకు ముద్దువచ్చు వసంతసేన
యను భోగముచిన్నది ఆబిడ.

అయ్యయ్యో! యని సభలో ఒక్కటే ధ్వనులు!! ఆశ్చర్య
విషాదసంభ్రమములలో - మున్నిరిగొన్న ఆ న్యాయసభ నిస్త
రంగజలధివోలె వింతయై కానవచ్చెను.

ఎవరు చంపిరో నీకు తెలియునా?

ఆహా! తెలియకేమి? దివ్యముగా తెలియును.

ఆమెనుజంపినది నేనుగాదు సుమా!

త్ర మూలు ముందు వ్రాసికొమ్మని అధికారి కరణమును హెచ్చరించె.

ఓహో! అనరాని మాట అంటినేపో! వెంటనే దానిని వ్రాతలో ఎక్కింతురా? అని శకారుఁడు ముందునకుఁ బోయి ఉమ్మితో ఆ వ్రాత చెఱపి వేసెను.

అధికారికి ఆఁపరాని కోపమే వచ్చినది. నిన్నేమి చేసెదనో చూడు మని శకారుని గద్దించెను. ఓహో! మాయప్ప మగఁడవా నీవు? మా యమ్మ అల్లుఁడవా యేమి? అని వెటకారముగా నవ్వి! సరే యని వాఁడు తలవంచి కూరుచుండెను.

ఇంతకు వసంతసేనను జంపినదెవరు?

ఇదిగో! తప్పక చెప్పెదను వినుఁడు :— శ్రద్ధగా సావకాశముగా ముక్కు మొగములు దగ్గఱ పెట్టుకొని నా మాటలు విని మఱి ఆవల వ్రాసికొనుఁడు. వసంతసేనను చంపినవాఁడు ముమ్మాటికి చారుదత్తుఁడే!!

పిడుగువంటి ఈ దుర్వార్త విన్న సభాసదులకు ఊపిరి సలుపలేదు. ఒకరి మొగము నొకరు చూచుకొనిరి. నోట మాటయే లేదు. చచ్చినది వసంతసేనయా! చంపినది చారుదత్తుఁడా! ఇంత విపరీత ముండునా? ఓరి దుర్మార్గుడా! ఎంత ' అభాండము ' వైచితివిరా? లాఁతివారి మనస్సు

నొచ్చునేమో యని పల్లెత్తుమాటయేని పలుకఁజాలని మహానుభావుడే చారుదత్తుఁడు !! అందును తాను వలచిన కాంతను వసంతసేనను చంపుకొనునా ? ఓరి తులువా ! ఎంతమాట అంటివిరా? వీఁడేదో పెద్ద కుట్రలు త్రవ్వి ఈకూఁతలు కూయుచున్నాఁడని సభలో ఒక్కటే గుసగుసలు. త్రాగుఁబోతు మాటలకు విలువ కట్టరాదు; తటాలమి కొట్టుఁడీ తుచ్ఛునని పదిమంది పదిమాట లనిరి. సభలో అంతులేని గగ్గోలు పుట్టె. శకారుఁడు మోరసాఁచి చురచుర చూచెను. న్యాయాధికారి కనుసైగఁజేసి నలుమూలలకు సేవకులు పరువులు త్రొలిరి. సభామంటపము నిశ్శబ్దమాయె.

సరే ! చారుదత్తుఁడు వసంతసేనను చంపినాఁడని వీని వాదము. పైఁగా - తాను జూచినట్లే మాటలు. అది యట్లుండె. ఇందులో మొదటి సాక్షి ఈతడే కావచ్చును. 'వాది' సూత్రము వసంతసేన తల్లియే కావలె నని ఆబిడను వెంటనే సులంభువగా పిలువుమని న్యాయాధికారి శోధకుని బంపెను. వాఁడును గివ్వునఁ బోయి ఈ దుర్వార్త ఏదియుఁ జెప్పక నెమ్మదిగా ఆమెను దీసికొని వచ్చెను. మూఁడు కాళ్ళ ముసలిదైయె గడగడ వడంకు మేనితో ఆ వృద్ధురాలు మండపములోనికి వచ్చి అధికారులకు దండములు వెట్టి నిలువఁబడెను. పెద్దతనము, పైఁగా జబ్బుమానిసి యని అధికారి కరు

రెంచి ఆమూల కూరుచుండుమని చేసైగ చేసెను. అమ్మా! తల్లీ! వచ్చితివటే! యని శకారుఁడు వికారముగ పండ్లు — అన్నియు బయటపెట్టి — ఇగిలించుచు పలుకరించెను.

ఆవిడ ఊరుపేరు లన్నియు వ్రాసికొనిరి. విచారణ ప్రారంభమాయెను.

వసంతసేన నీ కూఁతురే గదా!

అవును స్వామీ!

ఆమె ఇప్పు డెక్కడ ఉన్నట్లు?

మిత్రుని యింటికి వెళ్లినది.

ఎవరా మిత్రుఁడు?

అయ్యా! ఈ ప్రశ్న న్యాయ్యము గాదు; ఏలినవారు మాజాతి గుట్టుమట్టులు కాపాడవలె. ఎందఱో ప్రభువులు మాయింటికి వత్తురు పోదురు., అక్క-ఱనుబట్టి మేమును బోదుము. మా వృత్తిని గుర్తించి మా బ్రదుకు బయటపెట్టవద్దని నా ప్రార్థన.

ముసలిదానా! నేనుగా — ఈమాట అడుగలేదు. అనుమానింపవలదు. వ్యవహారమే ఇట్లని అడుగుచున్నది.

అయ్యా! వ్యవహారమున్నదా! అయినచో వినుఁడు:—

ఆయనగారు చారుదత్తుఁడు; వినయదత్తుని మనుమఁడు — సాగర

దత్తుని కొడుకు. కోమట్లపేటిలో కాంచీపురము. ఆయన యింటికే నాపిస్తు పోయెను.

ఎప్పుడు ?

మొన్నరాత్రి

ఇంకను రాలేదా ?

లేదు బాబూ !

చారుదత్తునకు వసంతసేనమీఁద కోప మేమైన ఉంచునా ?

అయ్యో ! రామా ! ఆ మహానుభావుఁడే ! కోపమే ! ! శీలములో ఆయనవంటివాఁడు న భూతో న భవిష్యతి.

సరే యని అధికారి ఆ ముక్క లన్నియు సక్రమముగ వ్రాయించి ఏదో వ్యవహార మున్నదని చెప్పి చారుదత్తుని తీసికొని రమ్మని శోధనకుని బంపెను. శోధనకుఁడు చారుదత్తుని యింటికేఁ బోయి న్యాయాధికారి యాజ్ఞను విన్నవించెనో లేదో ఆయన గుండెలో పెద్ద రాయి పడెను. ఎన్నఁడుగాని ఆతఁడు న్యాయసభకు పోయినది లేదు. పైఁగా దేశములో రాజకీయపుగొడవ లాయె ! ! ఏ గోడ కే చెవు లున్నవో ! ఆర్యకుని గాపాడుటయే మహాపరాధ మయ్యెనా ! రాజద్రోహులు రాత్రి తనయింటికి వచ్చి మాటా

డినమాట దివాణములో పొక్కిపోయెనా! ఏమో ఏమయ్యెనో? అని చారుదత్తుఁడు కలవరపడి బయటికి వచ్చుచుండఁగా – అపశకునము లెన్నో యెదురాయె. సరేయని యాతఁ డెట్లో

బెదరుచునే పోయి న్యాయసభలో కాలుపెట్టి న్యాయాధికారికి నమస్కరించెను. ఆతఁడును గౌరవించి కూరుచుండుమని తగిన యాసనమును జూపెను. ఔరా! నేరగానికి మర్యాద చూపెదరా! అప్పుడే వ్యవహారములో పక్షపాతమా? అని శకారుఁడు కేకవేసెను. కాని యెవ్వరు దానిని పట్టించుకోలేదు.

చారుదత్తుని యూరుపేరులు వ్యవహారమునకై వ్రాసికొనిరి. ఆర్యా! వసంతసేనను నీ వెఱుంగుదువా! యని అధికారి యడిగెను. జంకుచుఁ గొంకుచు ఆఁ! తెలియకేమి! అని చారుదత్తుఁడు ఒప్పుకొనెను.

ఆమెతో మీ కేమైన సంబంధ ముండెనా?

దానికి చారుదత్తుఁడు వెనుకాడి మాటాడఁడయ్యె.

అప్పురా! వీనికిఁదోడు సిగ్గు కూడనా! సిగ్గు సెరము లేక అంకు తనము చేసిన వీని మొగమునకు సిగ్గా? ఎగ్గా! నిజమే యని ఒప్పుకొన్నచో నేరమియే ఖాయమౌనని ఈ నాలిమ్రుచ్చువాని నటన. అని వెక్కిరింపుగా శకారుఁడు సభలో ధిక్కరించెను.

ఆర్యా! వ్యవహారములో సిగ్గేల? అని అధికారి ప్రశ్నించెను.

తెలిసినమాట అడిగెదరేల యని చారుదత్తుఁడు మొగము వంచుకొనెను.

అనఁగా వసంతసేన నీకు ఉంపుడుఁగత్తెయే గదా?

ఊఁ

ఆవిడ ఇప్పు డెక్కడ ఉన్నది?

తన యింటికే పోయినది.

ఇంటిలో లేదఁటగా!

ఎవ రన్నారు?

అదిగో! వసంతసేన తల్లియే అన్నదని అధికారి ఆమెను జూపెను.

అయ్యో! ఏదో ప్రమాదమే జరిగెనని చారుదత్తుఁడు తల్లడిల్లెను. అధికారివర్గములో అలజడి పొడమెను.

శకారుఁడు — ఇగిలించుచు సకిలించెను.

అయ్యా! వసంతసేన మీ ఇంట లేదందురా?

లేదు — లేదు. నిన్ననే వెళ్ళినది. ఇంటికే చేరెనని అనుకొంటిని.

నిన్న మీరు ఇంటిలో ఉంటిరా?

లేదు. పుష్పకరండకమునకు పోయితిని.

అక్కడ ఏమి పని ?

విశ్రాంతి కోసము.

తోడు - ఎవ్వరైనఁ గలరా ?

వసంతసేనను బండిలో రమ్మని ముందే నేను వెళ్ళితిని.

సరే! బండి యెక్కి వసంతసేన తోటలోనికి వచ్చెనా ?

ఏమి చెప్పను వానికి మనస్సు పోలేదు. బండి వచ్చెనుగాని బండిలోవచ్చినది ఆర్యకుడుగదా? ఆ కథ ఈ కథలో కలసి ఆపద ఒదవునేమో !!

అంతలో బండిలో వసంతసేన పోవుట కనులార నేను జూచితి నని సభలో వీరకుఁ డఱచి ముందునకు వచ్చెను. రాజమార్గ ములో రాజకీయపు గొడవలో చందనకుఁడు - నేనును ఉండఁగా వసంతసేన బండిలో పోవుట ఉభయులము చూచితిమి. ఆ ఘట్టములో మా కిర్వురకు వివాదము సైతము పొడమినది. దానికోసమే నేనును వచ్చితి నని వీరకుఁడు విన్నవించెను.

వీరకా! నీ వివాదము మాటరేపు చూతము. అదిగో! ఆగుఱ్ఱ మెక్కి త్వరగా పుష్పకరండకమునకుఁ బోయి అక్కడ స్త్రీశవ మున్నదేమో చూచి రమ్మని అధికారి ఆజ్ఞ యిచ్చెను.

ఎవ్వరా స్త్రీ? ఏమిటాకథ యని చారుదత్తుఁ డడిగెను. ఎవ్వరో కాదు; ఆమె వసంతసేనయే. ఆమెను జంపినది నీవే అన్నట్లు

శకారుఁడు చూచినట్లు నేరమి మోపినాఁడని అధికారి వెల్లడించెను.

హారిహారీ! యని అవటిల్లి చారుదత్తుఁడు నేల కొఱగెను. అయ్యో! కూఁతురా! ఇంకేమి కూఁతురే! యని వృద్ధురాలు గుండె కొట్టుకొని బిల్లబీటుగ పడెను. సభలో హాహారావములు మేర మీఱి పోయె.

అంతలో వీరకుఁడు వచ్చి తోఁటలో స్త్రీశవ మున్నమాట నిశ్చయమే యనియు - నక్కలు కుక్కలు శవమును పీఁకుచుండుటచే ఆనవాలు పట్టుటకు అయితి కాలేదనియు సొమ్ములు గిమ్ములు లేవియు ఒంటి మీఁద లేవనియు నమ్మఁబలికెను. ఆ ప్రాంతములో దిక్కును మొక్కును లేని కళేబరములను పాఱవైచుట పరిపాటి. ఆ కళేబరము ఆఁడుదానిదే అన్నమాట నీవెట్లు పోల్చితివని అధికారి వీరకు నడిగెను. అక్కడ పడియున్న జుట్టు - కట్టు - కాలు వ్రేలు మున్నగునవి చూచి నిరూపించితి నని వీరకుఁడు తెల్పివైచెను.

చారుదత్తుఁడు దోషియే యన్నంత సాక్ష్యము వచ్చి పడుచుండెను. అయ్యో! కర్మమా యని యేడ్చువారు కొందఱు. ఏమో! నేరమి చేసెనేమో యని

నమ్మువారు కొందఱు. ఛీ! చేసియుండునా పాపము? అనుమా నించువారు కొందఱు. చేయునే? చేయఁడని సిద్ధాంతము చేసి కొన్నవారు కొందఱు. ఈ తీరుగా ప్రజలలో పలువురు పలుకుబాల గుసగుసలు పోసాగెను. నగలిచ్చి వచ్చుటకై వసంతసేన యింటికే పోవుచున్న మైత్రేయుఁడు అదే సమయములో చారుదత్తుని విచారణ యని ఎవ్వరో చెప్పఁగా విని చుక్క ఊడిపడ్డట్లు న్యాయసభలోనికే వచ్చిపడెను. సభ యంతయు విచారాక్రాంతమై యుండఁగా చారుదత్తుఁడు నేలమీఁద చేరగిలఁబడి యుండఁగా – ఆదృశ్యము మైత్రేయుఁడు చూచి గుండె పగిలి నెచ్చెలిని సమీపించి, ఈ కథ యేమని అక్కడివారి నడిగెను. ఎవ్వరో చెప్పిరి. అయ్యో! పాపీ! ఎంత పని చేసితివిరా? మహాపూజ్యునిమీఁద నేరమి యారోపించు దౌర్భాగ్యదామోదరచక్రవర్తి పుంగవుఁడు నీకన్న మఱెవ్వ రుందురని శకారునిమీఁదికి ఒంటికాలిమీఁద లేచెను. వాఁడును తారసిల్లి బూతుకూఁతలకు దిగెను. చేతులు చేతులు కలసినవి. ఇంతలో మైత్రేయుని చంకలో ఉన్న నగలమూట గల్లుమని క్రింద పడెను. శకారుఁడు పట్టుకొని ఊడఁదీసి, ఇవిగో! ఇవిగో! వసంతసేన నగలు; ఆ నీచుఁ డాబిడను చంపివైచి ఈనగలితని చేతిలో దాఁచిపెట్టినాఁడని పెద్ద గొంతుపెట్టుకొని అఱచుచు గెంతుచు నగలమూట న్యాయాధికారివద్ద ఉంచెను.

అతఁడది చూచి విస్మయపడి ఆ ముసలిదానిని పిలిచి ఈ నగలు నీ బిడ్డవేనా చూడుమని చేతి కిచ్చెను. అప్పటికి తెప్పిరిల్లిన ఆ వృద్ధురాలు అవి చూచి మఱల తెల్లపోయెను. అదే సందుగా చూచి, శకారుఁడు అమ్మా! తల్లీ! చెప్పవమ్మా! ఆ నగలు వసంతసేనవి కావటమ్మా! చారుదత్తుఁడే నీ కూఁతురు గొంతు కోసి నీకొంప తీసెనని దగ్గఱకు వచ్చి ఊదరఁబెట్టఁజొచ్చెను. ఛీ! మాయదారి మ్రోఁడా! నగల కోసమేమి? చారుదత్తుఁడేమి? నా కూఁతును జంపుటేమి? తన యింట దాఁచివచ్చిన సొమ్మును దొంగ లెత్తుకొని పోఁగా దానికై వేఱొక నగను పంపిన బుద్ధిమంతుఁడు ఈ నగలకోసమని ఇంత పని చేయునఁటరా? నీ నాలుక ఊడిపోను. అని యాబిడ వానిని ఈసడించెను.

ఇవి నీకొమార్తెవా కావా చెప్పుమని అధికారి మఱల అడిగెను. ఊపిరి ఎగఁదట్టి క్రిందట్టు మీఁదట్టునై కన్నీళ్ళు కాలువలై మొగమున జాలువాఱ - ఏమిచెప్పను నోరురాక అవి మావి కానే కావని ముసలిది గద్దించి పలికెను.

అబద్ధము లాడెదవా ముసలిముండా! యని శకారుఁడు లేచి హుం. కారము చేసెను. నగలుపోలిన నగలు కమసాలి చేయఁడా యని ఆ ముదుసలి నిబ్బరముగా బదులు చెప్పెను. పైఁగా -

పాపిష్ఠుఁడా! నా బిడ్డ విషయమై గోడవ నీ కేలరా! అయ్యా! స్వాములూ: నా బిడ్డ చచ్చెనో చావలేదో ఆ బెడద యుంతయు నాదేగదా! ఈ రగడలో పోరు చేసికోవలసినది నేను గాని ఇతఁడెవఁడు? నా విజ్ఞప్తి లేకయే ఈ గోడు అర్పను తీర్పును మీరేల పూనుకొంటిరని ముదుసలి తీండ్రించెను. కాని, పరిస్థితి వేఱాయె. శకారుఁడు ఒకేమొగిని వాదమునకు తలపడఁజొచ్చె. ప్రత్యక్షసాక్ష్యములా బలవత్తరములు కాన వచ్చె. చారుదత్తుని పక్షమా దుర్బలమై పోవసాగె. తీర్పు సెప్పువారికి సాక్ష్యమే ఆధారముగాన చారుదత్తుని మీఁదికే నేరము ఒఱిగిపోయెను.

ఈ నగ లెవ్వరివి? ఇవి నీమిత్రుని చేతి కేల వచ్చెనని అధికారి చారుదత్తుని ప్రశ్నించెను. అయ్యా ఇంకను ప్రశ్న లేల? నేను సర్వథా దోషినే యని చారుదత్తుఁడు లేచి నిలిచెను.

వసంతసేనను నీవే చంపితివా యని మఱల ప్రశ్నించెను. నేను దోషినంటినిగదా యని చారుదత్తుఁడు పలికి తల వంచుకొనెను.

అధికారి సైగ చేయఁగా శోధనకుఁడు వచ్చి చారుదత్తునికి వేసిన ఆసనము తీసివేసెను. శకారుని అంతరంగము ఉప్పొంగి పోయెను.

అయ్యో! కూఁతురా! యని ఆ ముసలి నేస్వ ఆఁగలేక గొంతెత్తి బావురుమని ఏడ్వసాగెను. చారుదత్తుని రెండుకన్నులలో గిఱ్ఱున నీళ్ళు తిరిగెను. మైత్రేయుఁడు కొయ్యఁబాఱి అట్టె నిలిచిపోయెను. సభలో సర్వజనము కన్నులు చెమ్మగిల్లెను.

అధికారి సైగనుబట్టి తలారులు త్వరగా వచ్చి చారుదత్తుని చేతికి సంకెలలు తొడిగిరి. హాహారవములతో ఆక్రందనములతో ఆవటిల్లిన ఆ సభను నాలుగువైపుల హెచ్చరించి న్యాయాధికారి యివ్విధిని చారుదత్తునికి శిక్ష చెప్పెను:—

చారుదత్తుఁడా! చేయవలసిన విచారణ చేసితిమి. సాక్ష్య మంతయు నీకు విరోధమే అయ్యె వ్యక్తిగతముగా నీవు దోషివని మేము ముమ్మాటికి భావింపము. నీ పూర్వచరిత్రమును బట్టి — నీకును వసంతసేనకును గల నెయ్యము తియ్యమును బట్టి ఆఁడుదానిని నీవు చంపినాఁడవనుటలో అర్థమే లేదని మాకుఁ దెలియును. కాని అన్నింటిని హతమార్చునట్టులు దోషినని పైఁగా నీవే ఒప్పుకొంటివి. ఆ పక్షములో నీవు చేసిన నేరము స్త్రీవధ.

దానికి శిక్ష మరణ దండనమే. న్యాయశాస్త్రమునుబట్టి తప్పనిసరి కావుటఁజేసి అదియే నేఁడు నీకు విధించుచున్నారము. అందులో — ఒక రహస్య మున్నది:— ఏ నేరము చేసినను బ్రాహ్మ

వానిని చంపరాదని శాస్త్రము సంప్రదాయము కద్దు. కాని దానిని నిర్ణయించుటలో తుదికి రాజుగారిదే అధికారము. కావున ఈ వ్యవహారమంతయు పాలక మహారాజు సన్నిధికి వ్రాయించి పంపెదము. ఆపై నీ భాగ్యమని పలికి చేయవలసిన 'తంతు' వెంటవెంటనే చేయించెను.

కొంతసేపటికి రాజసమ్ముఖమ్మునుండి రావలసిన వార్త రానే వచ్చెను. రాజాజ్ఞ ఇట్లని వినిపించిరి:—

"ఆ దోషి బ్రాహ్మణవంశ్యుడే కావచ్చు. కాని నగరమునకెల్ల అలంకారప్రాయమై సౌజన్యములో పేరు మోసిన వసంతసేనను చంపినవాడు మరణశిక్షకే పాత్రుడు. ఆ నేరము చాటించి, ఆ నగలతో ఊరంతయు వానిని కలయద్రిప్పి, ఊరికి దక్షిణాన చంద్రహాసముతో వాని తలను తెగనఱకివేయవలెను."

ఈ కఠోరవార్తకు అధికారి బృందము ఉస్సురని చేయునది ఏమియు లేక చారుదత్తుని చండాలుర కప్పగింపుమని శోధనకునకు ఆజ్ఞపెట్టి నాటికి న్యాయసభను చాలించిరి.

గంతులు వైచుచు చిందులు త్రొక్కుచు లిల్లాయిపాటలతో మీసపు మీటులతో మిట్టి మిట్టి నడకలతో శకారుడు పైలా పచ్చీసుగ కొంపకు చేరుకొనెను.

పదియవ ప్రకరణము

వెఱ్ఱికలవంటి తలారు లిర్వురు భయంకరములైన కత్తులఁ చేతులఁ బట్టి యమభటులువలె కన్పట్టుచు చారుదత్తుని ఊరేఁగించుచు వధ్యస్థానమునకు కొంపోవుచుండిరి.

"ఓహో! ప్రజలారా! సరిగా వినుఁడు వినుఁడు !! ఈతఁ డెవ్వరో తెలియునా ? సాగరదత్తుని కొడుకు; వినయదత్తుని మనుమఁడు. పేరు చారుదత్తుఁడు. దయా దాక్షిణ్యములు లేక పుష్పకరండకవనములో ఒంటరి పాటు చూచి వసంతసేన యను సానిని నగలకోసమని ఆసపడి గొంతు పిసికి చంపినట్లు సాక్ష్యము కుదిరినది. తానును ఒప్పుకొనియె. అందువలన న్యాయాధికారు లీతని తలను దీసివేయుఁడని మా కాజ్ఞ యిచ్చిరి. ఇదే హెచ్చరిక !! ఎవ్వరైనఁ గాని ఇట్టి నేరము చేసిరేని ఇట్టి శిక్షలు తప్పవు. జాగ్రత్త!" అని పెద్ద వీధిలో చాటింపు వేసిరి.

అయ్యయ్యో!! యని పౌరులెల్లరు హాతాశులై నడుములు విఱిగి గుములుకట్టి కన్నీళ్ళు కాల్వలై పాఱ వీధిలోనికి వచ్చి పడిరి.

ఔరా ! క్రూరచిత్తుఁడై చారుదత్తుఁడే ఈ ఘోరము చేసెనందురా ? ఛీ! మేము నమ్మమని

ఉక్కిరిబిక్కిరిపడువారు — పుణ్యాత్మునకు ఈ పాడులోకముతో పని యేమని నైరాశ్యము పొంది ఉస్సురనువారు — న్యాయసభలో న్యాయమ్మే మేక్సినదా? న్యాయాధికారికి కన్నులున్నవా యని కొట్టుకొనిపోయువారు — కౌశికుడు మోపిన నేరమియే ఇంత పని చేసెనా? ఘోర తలంచిన దెబ్బల కేమి కొదువరాయని చుర చుర చూచువారు — ఛీ! పాడురాజ్యము దిక్కుమాలిన దేశము వల్ల కాటి యేలుబడి!! ఇంతెలు వింతలు జరుగుచుండగా చూచు చుండవలయునా యని రోసపడువారు — పదిమందికి పనికివచ్చు బంగారుకుండ త్రాడు తెగి పాడునూతిలో పడిపోయి మునుగు చున్నదని వగచువారు — ఉజ్జయినీ నగరమున కెల్ల సజ్జనులని పేరుమోసిన ఇర్వురు పోవగా మన బ్రదుకు లింకేల యని అంగ లార్చువారు — అక్కటా! ఈయన ఇల్లాలు ధూతాంబ పరమ పతివ్రతాశిరోమణి. ఆమె ఎంత కుమిలి కూలారునో! ఒక్కగా నొక్క బిడ్డ ముక్కుపచ్చలారని ముద్దులపాప రోహాసేనుడు ఏమయిపోవునో యని వగట సెందువారు — ఛీ! ఈ దృశ్యము చూడనేల? లోక మిట్టులయ్యెనా! యని మొగముమీద గుడ్డ వేసికొని గుండెలు అవియ వాపోవువారునై ఆబాలగోపాలము ఊరు ఊరంతయు కట్ట కట్టుకొని నేల ఈనినట్లు ఒక్కటే రోదనముతో వీధులలో ఎగబడిరి.

చారుదత్తుఁడు వంచిన తలఎత్తఁడు. మెడలో గన్నేరు పూల దండలు వేసిరి. రక్తవస్త్రములు కట్టఁబెట్టిరి. ఒంటి నిండుగ రక్తచందనపుఁ బూఁత. తలపై వెయ్యాపుఁబిండి. చూచి కొందఱి గుండెలు చెదరిపోయెను.

ఆతనికి చావు తప్పదను చింత రవ్వంతయును లేదు. ఇంగువ కట్టిన గుడ్డవంటి ఈ వంశములో పుట్టి ఈ యపవాదు పొందుటకన్న చావే మేలని ఆతని భావన. అందులకే న్యాయసభలో కిమ్మన నేరక నేరమి యొప్పుకొనెను. కాని ఒక దుఃఖము — ఒక సిగ్గు ఆతని క్రుంగఁ దీయుచున్నవి. ఆఁడుదానిని జంపితినా? అందును నా ప్రియ కాంతను వసంతసేననా? ఇది ఊరంతట చాటింపా? ఇందులకే ఆ పుణ్యాత్ముని డెందములో కొందలము. దాని కేమి చేసెదనని లోలోన కుమిలిపోవును. మాట బైటికి రానీయఁడు. కన్నులలో నీరు చొటచొట దూఁకుచున్నవి. మొగమంతయు వింతయై యెఱ్ఱపడిపోయె. బిడ్డను కడసారి చూడవలెనని బెంగ ఏర్పడెను. మిత్రుఁడు మైత్రేయుఁడు — ఆ చిన్నవానిని నిమిషములో తీసికొని వచ్చెను.

నాన్నా! నాన్నా! యని రోహసేనుఁడు కెవ్వురుమనుచు తండ్రిమీఁదికి వ్రాలెను. రా! నాయనా! యని చేరఁదీసి బాబూ! నిన్నింకఁ జూడనురా! నీ కేమి యిత్తునురా నా తండ్రీ! ఇదిగో యిది యొక్కటియే నేను నీ కీయఁగల ఆస్తి. అది మౌక్తికము గాదు. సౌవర్ణము గాదు. ఏదో దేవతలకు పితృదేవతలకు ఇన్ని నీరుపోయుటకు పనికివచ్చు ఈ నూలిపోఁగులు తీసికోయని జందెము తీసి ఆ కుఱ్ఱని చేతిలో పెట్టినప్పుడు కన్నీరు వఱదలై గుండె చిద్రుపలై వెక్కి వెక్కి యేడ్వనివాఁడు ఒక్కఁడైనను అక్కడ లేఁడు. కడుపులో చేయి పెట్టి మనస్సులో చొఱఁబాఱి కలఁచివేసి నట్లాయె. హా! దైవమా! లోకములో సజ్జనులకే ఇట్టి పరీక్షలు పెట్టెదవా యని బోరున కొందఱు ఏడ్చిరి.

ఇంతలో — ఇఁక రావోయి ఛారుదత్తా యని తలారి ఒక్కఁడు గదురుకొనెను. ఓరీ! తప్పురా నోరు మూయరా యని రెండవవాఁడు అందుకొని, అవురా! ఇంతవానిని అగౌరవముగా పిలుతువటరా! ఈయన బ్రదుకు వరాల బ్రదుకు. కాలు చచ్చి కాదురా; కాలమునకు చిక్కిరా ఇటులైనది. రాహువు పట్టెనేపో చందమామను మ్రొక్కరటరా! అని వానిని మందలించెను.

మా నాన్నగారిని పట్టుకొంటి రెందులకని రోహసేనుఁడు అటు తిరిగి అడిగెను. బాబూ మా కర్మము!! ఏమని చెప్పుదుము! రాజాజ్ఞ మా నెత్తిమీఁదికి వచ్చి ఈ పని చేయించినది. మాదేమియు తప్పులేదు బాబూ! అని తలారి పలికెను. నేనే వత్తునుగా! నన్నే చంపుఁడు. మా నాన్నను పంపుఁడు — అని మరల ఆ కుఱ్ఱఁడు ఎవ్వరో చెప్పి అనిపించినట్టులు వెంటనే పలికి అందఱిని ఏడ్పించెను. నీ అమ్మ కడుపు చల్లగా నుండ! వెయ్యేండ్లు వర్ధిల్లవయ్యా నాయనా యని గుండె జలదరింప తలారి పలికి ముద్దు చూపెను.

అప్పటికే ఆలస్యమాయె నని తలారులు వీధిలో దాటి చేసికొని మరల మరల చాటించుచు పోవుచుండిరి. వీధి మలుపు తిరిగి శకారుని మేడమీఁదికి చాటింపు వినఁబడి స్థావరకుఁడు బెదరిపోయెను. కాని— పాపము వాఁడేమి చేయును? వాని కాలుసేతులు శకారుఁడు కట్టివేయించెనే!! పంజరములో చిలుకవలె ఆసులో గొట్టముమాడ్కి అక్కడనే గదిలో తిరుగును; దొరలును. ఏదో అఱచుచు గగ్గోలుసేయును. వినువాఁ డెవ్వఁడు? అయ్యో! దేవుఁడా! చారుదత్తుఁడే చంపెనా? మరణశిక్షయే వేసిరా! ఓరి పాపాత్ముఁడా! శకారుఁడా! ఎంతపని చేసితివిరా! నీవు కాదఁటరా ఆ యమ్మను

చంపినది. నేను గాపటరా బండిలో ఎక్కించుకొని వచ్చినది? అయ్యో! నేనేమి చేసెదను. నామాట ఎవ్వరు విందురు? ఊరు ఊరంత కట్ట కట్టుకొని వచ్చియు నాలుక కన్నులు పెట్టుకొని చూతురే! నిజ మేదో విచారింపరే! అయ్యో! రామా నాకు కాళ్ళు లేవే! ఛీ! పాడు బ్రదుకు — ఎందులకింక? క్రిందికి దూకెదను. అందఱితో చెప్పెదను. నేను చత్తునేపో! ముంచుకొని పోయినదేమి? ఆ పుణ్యాత్ముఁడు బ్రదుకఁడా? నాకు నరకము తొలఁగదా? అని నిశ్చయించి స్థావరకుఁడు — అమాంతము మేడమీఁదినుండి ఒక్క దూఁకు దూఁకెను. ఆ దెబ్బలో గొలుసులు ఊడిపోయెను. వింతగా పదిమంది చుట్టును గ్రమ్ముకొనిరి.

అయ్యలారా! అయ్యలారా!

నా మాట వినుండు. నేను శకారుని సేవకుఁడను. నా పేరు స్థావరకుఁడు. తోఁటలో వసంతసేనను శకారుఁడే చంపి ఆ గుట్టు బయటపెట్టెదనని బెదరిపోయి నా కాలుసేతులు కట్టివేసి మేడ మీఁద నన్ను ఉంచినాఁడు. ఈ చాటింపు విని నా గుండె కొట్టుకొని అమాంతము దూఁకితిని. నిజము మీకైన చెప్పరా? ఆ బంగారు బాబును వదలింపరా! ఆ పుణ్యాత్ముని బ్రదికింపరా! అని కాకిగోలగా స్థావరకుఁడు ఏడ్చి మొత్తుకొనెను. ఆ సంద

డిలో పదువురును జోక్యము తీసికొని ఆ సంతోషవార్తను ఉప్పొంగిపోవుచు స్థావరకుని చారుదత్తుని వైపునకు లాగికొని పోవఁజొచ్చిరి.

అంతకు ముందు చల్లనివార్తగా తనకు తోఁచిన ఈ చాటింపు విని శకారుఁడు మేడమీఁద గంతులు పెట్టుచు — ఆ సంతోషము పట్టఁజాలక క్రిందికి వచ్చి చూడఁగా స్థావరకుఁడు కన్పట్టెను. అయ్యో! కొంప మునిఁగెనే యని గుండె గుబేలుమన శకారుఁడు పరుగుపరుగున వచ్చి స్థావరకుని, రారా! నాయనా! పోదమని బతిమాలెను. అయ్యో! బాబూ! నీకొక దండము నీసేవ కొక దండము!! ఇంతపని చేసినవాఁడవు ఎంతపనియైన చేయవా స్వామీ? వసంతసేనను చేతులార నీవే చంపి — ఇంత దుర్మార్గమా! అని వాఁడు మొగము త్రిప్పుకొనెను. ఇదిగో! రా బాబూ! బంగారుసగ యని ఒకటి బహూకృతిగా శకారుఁడు వాని చేతి కిచ్చెను. వాఁడు దానిని దీసికొని అందఱకు చూపుచు, విన్నారా బాబూ! కన్నారా నాయనా! నిజము చెప్పవద్దని ఈ లంచము నా కిచ్చునఁట. అని రేఁగి బయటపెట్టెను. అయ్యయ్యో! వీని పొగరు దియ్య. నా సేవకుడుగా ఉండి నా ఉప్పుఁ బప్పులు తిని మాకే ఎసరు పెట్టి ఇంటిలో సొమ్ము

కాఁజేసెను. అందుచే వీనిని గట్టిచేయఁగా కట్టుఁద్రాళ్ళు త్రెంచు కొని తప్పించుకొని వచ్చి ఈ యపవాదు నా నెత్తిని చుట్టు చున్నాఁడు. వీనిని ముందు పట్టుకొనుఁడని తలారులతో శకా రుఁడు ఉపాయముగా హెచ్చరించెను. కొందఱు నిజమేమో యని భ్రాంతి పడిరి. కాని కొందఱు పట్టు పట్టిరి. తలారులు తికమకలై ఏమియు తోఁచక ప్రజలను ఘోరముగా తరిమికొట్టుచు స్థావరకుని సైతము పట్టుకొనిరి.

వాఁడును చారుదత్తుని చక్కఁగాఁ జేరి, తాను జేసిన బండిమాఱుపుచే, తానే ఇట్టి యవస్థను తెచ్చిపెట్టితినని ఏడ్చి అంతయు చెప్పుకొనెను. స్వామీ! పేదవాని మాట ఎవ్వరు విందురు? నిజము నిలుకడమీఁద తెలియవచ్చునుగాని అప్పుడు మీరు లోకమునకు దక్కరు గదా! అయ్యో! పాపాత్ముఁడను - ఎంతపని చేసితినని జాలి చూపులతో - పేదయఱపులతో ముచ్చెమటలు పోయఁగా ఒకే మొగిని ఏడ్చుచు మొత్తుకొనెను. ఓయీ! నీవేమి చేసెద వోయి! నీకు శుభమగుఁగాక. అని చారుదత్తుఁడు వాని మంచి తనమునకు మెచ్చుకొని దీవించి పంపెను.

కారంతయు తెలిసితిరి గదా !

ఇంక - ఆలస్యమేల యని శకారుడు తలారులను త్వరపెట్ట సాగెను. ఓరీ! పసి పీడ నాకుగానని తలారులు లోలోన విసుగు కొనుచు తప్పుదురా యని వధ్యస్థానమునకు కొనిపోయి కొంత సేపు ఆగిరి. ఇంకను - ఆగిరెందులకని శకారుడు ఎగిరిపడెను. అయ్యా ! రాజేమైన వార్త పంపునేమో ! శిక్ష యేమైన తగ్గునేమో ! చూచి మఱి చంపవలెను. ఇది మా కులాచారమని తలారులు బదులు చెప్పిరి. ఓహో! ఇరా కాసందేహమే అక్కఱ లేదు. మా బావగారి ఆజ్ఞాపత్రము నేనే స్వయముగా తెచ్చియున్నాను. కావలయునేని చూడుడు. ఇదిగో యని కాగితమొక్కటి శకారుడు వారి చేతిలో పెట్టెను. అందులో-ముద్ర వైచి, అక్షరాల ఆతనికి మరణశిక్షయే సంపూర్ణ శిక్ష యని రూఢిసేయుచు పాలకమహారాజు సంతకము కానవచ్చెను. ఆ కొంచె మాశయు అప్పటికి తీఱిపోయె.

లెక్కగా మూడవ సారి చాటింపుకూడ వేసిరి. చారుదత్తుని గుండెలు ఝల్లుమనియె.

అక్కడ బౌద్ధాలయములో

వసంతసేన ఓపిక చేసికొని మఱునాటి సాయంకాలము ఇంటికి రావలెనని పైనమాయెను. ఆమెను కనిపెట్టుకొని శాక్యభిక్షుడు

వెంట వచ్చుచుండెను. ఇంతలో వీధిలో ప్రజాసందోహము సేయు కోలాహలము వసంతసేన చెవినిబడి తెలిసికొని రమ్మని భిక్షుకుని పంపెను. అతఁడంతయు విచారించి, అమ్మా! ఇంకే మున్నది? చారుదత్తుని మరణ శిక్షయఁట! వసంతసేనను జంపినందులకఁట! అని యీ ఘోరవార్త చప్పున వినిపించెను. హరిహరీ! యని వసంతసేన అట్టె కట్టెవలె కొంతవడికి తెప్పిల్లి, అయ్యో! పాడులోకము!! కన్నులు లేవా! దేవుఁడు లేఁడా? న్యాయ్యము లేదా? అని వెఱ్ఱివెఱ్ఱి చూపులతో వెక్కివెక్కి యేడ్పులతో చేతులు పిసికికొనుచు గుండెలు బాదుకొనుచు — ఇంక నా జన్మ మెందులకు? నేను బ్రదికి యేల? అని నేలమీఁద కూలఁబడిపోయెను. అమ్మా తడవు సేయరాదమ్మా! ఏ సహాయ మెటువచ్చునో? ఆవల విచార పడి లాభమేమి? మనము పోవుటే మంచిదని శాక్యభిక్షుకుఁడు త్వరగా ఆమెను దీసికొని వధ్యస్థానము వైపునకే తరలెను.

వధ్యస్థానము చూచినంతనే వధ్యుల ప్రాణములు ముందే పోవును. పవగోలువు — ఆ ఎము కల గూడులు—ఎండిపోయి పండ్లు బైటపడి ఇగిలించినట్టు కాన వచ్చు ఆ పుఱ్ఱెలప్రోవులు — నక్కలు కుక్కలు నాఁబొలు పీకి కొని తిని చిక్కురు బొక్కురుగ లాగివైచిన ఆ మానవ కళే

బరములు - చెల్లాచెదరుగా కానవచ్చు ఆ కాలుసేతుల మొండెములు తుండెములు చూపఱకు భీతు గొలుపుచుండును.

అచ్చోట నడుమ ఎత్తుగా వేదిక వంటి వధ్యశిల ఒక్కటి ఉన్నది. దానిపై నిలిచి నిమీలితాక్షుఁడై చారుదత్తుఁడు దైవధ్యానములో మునిఁగిపోయెను. ఇంతలో తుదిసారి చాటింపు వినవచ్చి ఒడలు జలదరించి చారుదత్తుఁడు కన్నులు తెఱచి మహాజనులను జూచి ఇట్లని పలికెను:—

ఓహో !! పౌరులారా !! ఈ యాపదలో పడిపోయితినని నాకు విషాదమే లేదు. సూర్య చంద్రాదులకే ఆపదలు తప్పలేదు; మనమనఁగా ఎంతవారము? పుట్టినవాఁడు గిట్టక మానఁడు. కాని ఒక్కటే దిగులు – పొగులు; జనాపవాదము వచ్చెనేయని !! నా ప్రియకాంతను చంపితి ననియు !! కాలు జాఱిన జాఱవచ్చుఁగాక ! కీర్తి జాఱిన చేయునదేమి ? నా పూర్వచరిత్రలో ఏదియైన రవ్వంత మేలు మీకు కానవచ్చెనేని అది మదిలో ఉంచుకొని ఈ విషాదగాథ మఱచిపోవలెనని నా ప్రార్థన. ప్రతిష్ఠపోయిన వెనుక బ్రదికి లాభమేమి ? పరోపకారపారీణులారా ! దీనజనబంధువులారా! ఇవిగో ! నా జోతలు— అందుకొని ఒక్కటే సాయము చేసి

పెట్టుచుండుము: — ఒక్కగా నొక్క కొడుకు రోహసేనుఁ డున్నాఁడు; వాఁడేమో వట్టి పసికూన. ఇంకను వానికి రెక్కలు రావు. నాయిల్లాలు ధూతాంబ నా చావు వినకమున్నె ఏమయిపోవునో నాకు తెలియదు. తల్లియుఁ దండ్రియు లేని ఆ బిడ్డను ఒక కంట కనిపెట్టి ఏదో ఇంతవానిని జేసి మా యింటి దీపము నిలువఁ బెట్టుఁడు. అదే నాకు పదివేలు. ఏ లోకములో ఉన్నను మీ మేలు మఱువలేను. పోయెదను సెలవా! ఈ లోకముతో నాకిఁక పని లేదు. పరాత్పరా! పరంజ్యోతీ! పరమేశ్వరా! నీలో నన్ను కలుపుకోవయ్యా! తలారులారా! మీ పని మీరు చూచుకొండుఁ!! అని మోఁకరించి కౌదల వంచి కన్నులు మోడ్చెను.

అయ్యో! పుణ్యాత్ముఁడా! ఆహా! పుణ్యాత్ముఁడా! యని ఒక్కటే మొగిని ఏడ్పులు నాలుగు చెఱగులనుండి వినవచ్చెను. కన్నులు తుడుచుకొని చండాలురు కత్తులు చేతులలో పదిలపఱచుకొనిరి. చూతు రేమియని కెవ్వున కేర్చుచు నయనానందకర మహోత్సవము స్వయముగా నడపిం పఁబూని ఉవ్విళులూరు శకారుఁడు తలారులను మందలింపను మూదలింపను దీక్ష వహించెను. అవురా! వీని చావునకే ఇంత మంది ప్రజలు కట్టకట్టుకొని వచ్చిరే! నావంటి ఉత్తమపురు

క్షుని నరమానవుని మరణమునకు ఎంద కెంపటు వత్తురోగదా! యని వాఁడు మదిలో ఉబ్బిపోవుచు కానిండు కానిండని గద్దిం పసాగెను.

ఆ పనిలో ఉన్న తలారు లిర్వురు ఒకరి కొకరు వంతులు వైచికొనిరి. నీదిరా ముందు నీదిరా యని వివాదము దాఁక సాగి చీట్లు వేసికొనిరి. అదేమో! వాండ్రలో పెద్దవానికే ఆ వంతు ముందు వచ్చెను. సాధుపురు షుఁడే! నిరపరాధుఁడే! లోకైకరంజకుఁడే! అయ్యో! కర్మమా! యని మనస్సు ద్రవించి అంతలో ఆతఁడు రాజ శాసనమ్ము స్మరించి తనకు తప్పదని ఎంచి చారుదత్తునకు ప్రద క్షిణమ్ము కావించి దండము వెట్టి, బాబూ! రాజాజ్ఞ కావున నిన్నుఁ జంపుచున్నాను. నా తప్పు మన్నింపుమని మఱిమఱి వేఁడుకొనెను.

ఓయీ! ఇందు నీతప్పు ఏము న్నది గనుక! రోఁత పుట్టిన ఈ బ్రదుకునకు విముక్తి కలిగించు నీకు పైఁగా నేను చాల ఋణపడినట్లు. అని చారుదత్తుఁ డతనికి వింతగా కృతజ్ఞత చెప్పెను.

... నటుకవలెనని ఉంకించెనే కాని చాప మాతని ఛేతులు కట్టివేసినట్లాయె. ఉన్నకొలఁది ఈ

పుణ్యాత్ముని మనస్సు కొట్టుకొనదా ! తొందఱగా కానిమ్మని రెండవవాఁడు పలికెను.

ఓరీ ! కాదురా ! ఎవ్వరినైన చంపవలసినప్పుడు ఒక్క గడియ ఆఁగుట ఎందులకైన మంచిది.

అదెట్లు ?

ఏమో ! ఒకవేళ ఆ _ వేసిన శిక్ష తగ్గనువచ్చు. నిజమేదియో తెలియరావచ్చు. రాజునకే దయ కలుగవచ్చు. రాజునకు కొడుకే పుట్టవచ్చు. రాజే మాఱిపోవచ్చు !!

ఛీ !! నీచుఁడా ! రాజే మాఱు. నఁటరా? నోరు మూయుము. తన్నెదనని శకారుఁడు కోపగించి, చంపవేమిరా ! చేతఁగాదఁటరా ! పోనీ నేనే చంపెదనని ఎగిరి పడెను. మా బంగారుబాబూ ! వరాలనాయనా ! అంతభాగ్యమయ్యా ! రావయ్యా స్వామీ ! రా ! అని తలారి తన కత్తిని శకారుని చేతికి ఈయఁబోయెను. దాని కాతఁడు మఱెంత అదరిపడి నీపని నీవు చేయవేని నిన్నేమి చేసెదనో చూడుమని బూకరించెను. బాబూ ! మీవంటివారి విషయమైనచో ఏమాత్రము జాగు సేయమని ఆ తలారి విసుగుకొని, చారుదత్తుని వంకకుఁ దిరిగి, అయ్యా ! ఇదిగో తప్పలేదు. మనస్సు నిబ్బరించుకో. దేవుని తలఁచుకో ! నీకు మంచిలోకమే ఉన్నది బాబూ ! అని.

కత్తిపిడి గట్టిగా పట్టుకొని నఱకవలెనని ఎత్తెను. అదేమో చేతిలోనుండి జాఱి అపశకునముగా ఆతనికి తోఁచి, అమ్మా! కనకదుర్గమ్మా! కనికరింపవమ్మా యని చేతు లెత్తి మ్రొక్కి-వాఁడు నిలఁబడిపోయెను. ఛీ! టక్కరివిధవా? కత్తి - గట్టిగా పట్టలేక కొంటెవేషము వేసెదవా! సరిగా - ఈసారి పట్టుకో చూతమని శకారుఁడు కస్సుబుస్సుమనెను. ఓరి! భగవంతుఁడా! ఇదేమి కర్మమురా! యని తలారి తక్కుచు తాఱుచు కత్తి మఱల తీసికొని దానికి తయారయ్యెను.

ఇంతలో - 'వద్దువద్దు' అని పెద్ద సద్దు వినవచ్చెను. ఎక్కడి జన మక్కడ త్రోవ యిచ్చి వయితొలఁగిరి. పరుగుపరుగున వసంతసేన దూఁకుచు వచ్చి హా! ప్రాణేశ్వరా! యని చారుదత్తునిమీఁద రివ్వున వ్రాలెను.

కలయా! కల్లయా! ఇదేమి యని చారుదత్తుఁడు కన్నులు తెఱచి చూచి నివ్వెఱవోయి నా వసంతసేనయే! నా ప్రియకాంతయే! బ్రదికి వచ్చెనా యేమి? స్వర్గమునుండి జాఱివచ్చెనా! లేక నేనే స్వర్గములో కాలు పెట్టితినా! అని దిగ్భ్రమము సెంది సందేహముతో సంశయముతో ఆమెను కౌఁగిలించుకొనెను. అయ్యో! స్వామీ!

ఇదేమిటయ్యా యని శాక్యభిక్షుండు వాని అడుగుదమ్ములలో వ్రాలి గోడు గోడున ఏడ్చెను.

చీఁకటిలో వెలుఁగు పొడసూపి నట్లు—ఆ దశలో వెలసిన ఆ బ్రహ్మానంద మేమని వర్ణింపము, ఆమె బ్రదికెనన్న సంతోషము చారుదత్తునికా? ఇర్వురును బ్రదికిరన్న ఆనందము లోకులకా? బలే! నాకిది తప్పిపోయె నన్న సంబరము తలారికా? అందఱు ఆనందాబ్ధిలో ఓలలాడిరి. కాని పాపము! శకారున కొక్కరునకే ఈ యానందము పట్టలేదు. పైఁగా – సన్నసన్నగా జనములోనుండి తుఱ్ఱున జాఱిపోవసాగెను. అది కనిపెట్టి తలారులు చప్పున వానిని బట్టి కొని అక్కడనే ఆపివైచిరి.

ఇంతలో–కోటలో ఏదో "ముసలము" పుట్టెను. కొన్నాళ్ళనుండి రాజ్యమున కేదో అనిష్టము చుట్టుకొన్నదని తోఁచి పాలకమహారాజు నగరిలో హోమములు ధూమములు ప్రారంభమాయె. దొడ్డసంభావనలకోసము ఎండ టెండలో దవ్వుదవ్వులనుండి విఱుగఁబడి వచ్చిరి. పట్టుబట్టలు కట్టి పళ్ళెరమునిండ బంగారుకాసులు పోసికొని పాలక మహారాజు పంచిపెట్టుచుండెను. అదే సమయములో – ఆర్య

కుఁడు—వాని నెచ్చెలి శర్విలకుఁడు ప్రచ్ఛన్నవేషములు దాలిచి మందిని మార్బలమును వెంటఁబెట్టుకొని రాజమందిరములోఁ జొచ్చిరి. మున్ముందు వారు వీరకుని పట్టి బంధించి ఆవల కోటలోఁ రాజునకే ఎసరు పెట్టిరి. హితులు, పురోహితులు, మంత్రులు, సామంతులు, దండనాయకులు—ఉద్యోగులు అందఱు నివ్వెఱపడి అట్టె చూడసాగిరి. మహాసాహసియగు శర్విలకుఁడు ముందునకు వచ్చి కత్తి ఎత్తి కస్సున పాలకుని శిరస్సు నఱికివైచెను. ఔరా! ఔరా యని అందఱు తెల్లవోయిరేగాని ఆ వీరుని జోలికి ఎవ్వరు రారైరి.

ఆర్యకుని బుజముమీద శర్విలకుఁడు చేయివైచి, మహాజనులారా! నేఁడు సుదినమని భావింతును. దుర్మార్గుఁడై సజ్జనకంటకుఁడై యున్న పాలకుఁడిఁక మనకు లేఁడు. వాని దౌరాత్మ్యముగూర్చి వానియేల్బడిలోఁ కుంది వందురుచున్న మీ ముందు నేను ముచ్చటింపవలసిన పనియు లేదు. విష్ణ్వంశము లేనివాఁడు ఱేఁడు కానేరఁడను మాట దబ్బఱ గాదు. కాని ఆ యంశము లవలేశమున్నను వాఁడింతలేసి పనులు చేసియుండునా? నేరమి చేసెనన్నమాట రూఢియే యైనచోఁ రాజునైన శిక్షింపవలె. ఆ హక్కు ప్రజల కున్నది. ప్రజాబలమే రాజుబలము. ప్రజలను చల్లగా ఏలుకోలేని రాజు అధికారములోఁ

ఉండనేరఁడు; ఉండఁగూడదు. పాపము పండినప్పుడు భగవంతుఁడే తగిన శిక్షచూపి తీఱును. అందులో మనము నిమిత్తమాత్రులము. పదిమంది నోళ్ళలో పరాత్పరుఁడే ఉండి మంచి సెబ్బరలు నిరూపించును. అందులకే ఆర్యకుఁడు రాజై తీఱునని జోళ్ళ జోకళ్ళ వేనోళ్ళ పాడిరి. ప్రజాపక్షమే మాపక్షము. ఆర్యకుఁడే నేటినుండి మన కందఱకు మహారాజు. అని పౌర్వాపర్యము లెస్సగా నిర్ధరించి లోపలినుండి కిరీటము తెప్పించి ఆర్యకుని తలపై పెట్టెను.

జయజయ – ఆర్యకమహారాజా! విజయీ భవ – అన్న కోలాహలము నలువలంకుల ఒక్కమొగిని దిక్కులు పిక్కటిల్ల మాఱుమ్రోగెను.

అప్పుడప్పుడే మంత్రులు– ఉద్యోగులు – దండనాథులు – మును పెవ్వరో వారేయని నిర్ణయించి పట్టాభిషేకమహోత్సవ ముహూర్తమును ఆవల నిశ్చయింతుమని చెప్పి ఆర్యకమహారాజునకు చందనకుని అంగరక్షకునిగాఁ జేసి, దండు వెంటఁబెట్టుకొని శర్విలకుఁడు వధ్యస్థానమువైపునకు పర్వులిడెను. అతని యుద్ధృతము చూచి ఎవరికి వారు త్రోవ యిచ్చిరి. సరాసరి శర్విలకుఁడు వధ్యశిలవద్దకే పోయి వసంతసేనా చారుదత్తులను కన్నులారఁ గాంచఁగలిగి, ఆహా! ఇర్వురు బ్రదికియున్నారులే యని నిలువెల్ల ఉప్పొంగిపోయి పాలకమహారాజు చచ్చె

ననియు ఆర్యకమహారాజు పరిపాలనకు వచ్చెననియు విన్నవించెను.

దానికి చారుదత్తుఁ డానందించియు తత్కాలున - ఏదో జ్ఞప్తికి వచ్చి, అయ్యో! నా మరణవార్త వినుచు ధూతాంబ యేమైపోయెనో యని గిలగిల కొట్టుకొనెను. వెంటనే శర్విలకుఁడు పర్వులు త్రోలి చారుదత్తుని యింటికి చేరి చూడఁగా-అక్కడ ఒక్కటే 'ఘోరకలి'గా ఉండెను. పిల్లవాఁడు రోహసేనుఁడు తల్లి చీరచెఱఁగు పట్టుకొని వెంటఁబడుచుండఁగా - అయ్యో! మా యవస్థ ఇట్టిదయ్యెనే యని రదనిక - వర్ధమానకుఁడు - మైత్రేయుఁడు గోడుగోడున నేడ్చుచుండఁగా ధూతాంబ అగ్నిగుండములో దూఁక నుండెను.

అమ్మా! ఆఁగవమ్మా యని శర్విలకుఁడు కేక వైచెను. ప్రక్కనే చారుదత్తుఁడు ప్రత్యక్షమాయెను. హా! ప్రాణేశ్వరా! బ్రదికితిరా యని పెద్దపెట్టున ధూతాంబ అఱచి అతని యడుగుఁదమ్ములలో వ్రాలిపోయెను. నాన్నా! నాన్నా యని పిల్లవాఁడు ముందున కుఱికెను. అయ్యో! మిత్రమా! ఎన్ని యగచాట్లు వచ్చెనయ్యా! యని మైత్రేయుఁడు చదికిలఁబడెను. అమ్మయ్యో! అమ్మ - అయ్యో

ప్రదీప్తి; మన కింకేమి కావలెనని రదనికా వర్ధమానకులు చెప్పికొల్లిరి. అందఱు — ఆనందములో మునింగియుందురే గాని పారవశ్యమునం జేసి ఒక్కరును ఒక్కమాటయు పలుకరైరి.

ఆర్యకమహారాజుల ఆజ్ఞానుసారము వసంతసేనకు అవకుంఠనము కావించి చారుదత్తునకు భార్యగా సమర్పించిరి. వేణానదీతీరమందలి కుశావతీనామక రాజ్యమునకు చారుదత్తుని ప్రభువుగా అభిషేకించిరి. శకారుని పెడఱెక్కలు విఱిచి కట్టి ఛీ పాపీ! పరమకిరాతకుఁడవు. నీ కర్మ మనుభవింపు మని తలారులు తలకొక తిట్టు తిట్టి బెట్టిద ముగఁ గొట్టి పట్టుకొని వచ్చిరి. వచ్చినవారెల్లరు — ఆ పరమ నీచుని బండబూతులు తిట్టి, చూతురేమి తలారులారా! ఆ పాడు పురువును నలిపివేయరేమి? ఆ క్రూరజంతువును గోసివేయరేమి? అని హెచ్చరిక చేయఁజొచ్చిరి. కుశావతీ భూపాలుని సన్నిధికి ఈడ్చుకొనివచ్చి ఆ శకారుని తలారులు నిలువఁ బెట్టిరి. ఆతఁడు దిక్కులు కలయఁజూచి ఒక్కఁడుగాని తన్నుఁ గావలెనన్నవాఁడే లేఁడు గనుక బెగ్గడిలి గుండె పగిలి అయ్యో! గాడిదనై పోయితినే! కోడినివలె నన్ను ఈఁకలు దూసి వేసెదరే! నాకెవ్వరు దిక్కని లోలోన కుమిలి కుతమాటి, యోగ్యచరిత్రుఁడగు చారుదత్తుఁడే ఇప్పుడు శరణ్యమని నమ్మి

ఆర్యా! చారుదత్తుఁడా! నన్ను రక్షింపవా యని మొత్తుకొని ఆయన పాదములలో వ్రాలెను.

ఛీ! పరమతుచ్ఛుని నిమేష [illegible]ని సహింపరాదని శర్విలకుఁడు ముందునకు వచ్చి పండ్లు పటపట గొఱికి అయ్యా! వీని కేమి శిక్ష సెలవిత్తురు? గట్టిగా త్రాళ్ళతోఁ గట్టివైచి కాట్లకుక్కలచే కఱపించినఁగాని కసి తీఱదు; ఱంపాన పఱపఱ కోసి పాఁతిపెట్టినఁగాని పాతకము పోవదు; ఒడలంతయు కండతుండెములుగ నఱికివైచి కాకులకు గ్రద్దలకు వేసినఁగాని దోసము లవలేశము మాయదు. మీరేమి సెలవిత్తురో దానికే బద్ధులమని నడుము గట్టుకొని నిలిచెను.

నా మాట విందురా యని చారుదత్తుఁడు పలికెను. అయ్యో! సందేహమా యని శర్విలకుఁడు అందుకొనియె. భట్టారకా! భట్టారకా! నన్ను రక్షింపవా రక్షింపవా! నీకాళ్లకు మ్రొక్కెద; నీవ్రేళ్లకు మ్రొక్కెద. ఎన్నఁడు ఇట్టి పను లిఁక-ఈ జన్మములో చేయను స్వామీ యని శకారుఁడు మొత్తుకొనెను. చూతురే మయ్యా? వీని నని పౌరులు తొందఱపెట్టసాగిరి. చారుదత్తుని మెడలో వేసిన వధ్యమాలను చేసేత వసంతసేనయే తెచ్చి శకారుని తలమీఁద విసిరివేసెను. అమ్మా! అనుగ్రహింప వమ్మా! ఇఁక నెన్నఁడు నిన్ను చంపుకొననమ్మా! నీవైనఁ

జెప్పవమ్మా! అని శకారుఁడు వసంతసేనవైపునకు కన్నులు వెట్టి నోటు తెఱచి ఆవ్వురుమని అఱచెను. ఛీ మూర్ఖుఁడా! నోరు మూయరా యని శర్విలకుఁడు ఒక్క తన్ను తన్ని, స్వామీ! ఏమి సెల వని చారుదత్తునివంకకు తిరిగెను.

చారు:— నేనన్నట్లు చేసెదరా?

శర్వి:— అభ్యంతరమా!

చారు:— ముమ్మాటికి?

శర్వి:— ముమ్మాటికి

చారు:— అయినచో శీఘ్రముగా......

శర్వి:— నఱికివేయమా?

చారు:— కాదయ్యా! విడచిపెట్టవలె.

శర్వి:— ఎందువల్ల?

చారు:— మనకు వీఁడు శత్రువే కావచ్చు! గొప్ప తప్పు చేసెనే యనుకో! శరణని కాళ్ళమీఁద పడెనే! కత్తితో కోయవచ్చునా?

శర్వి:— సరే! కుక్కలకు వేయఁగూడదా?

చారు:— కాదయ్యా కాదు. ఉపకారహతునిగాఁ జేసి అవలకు పంపవలె.

ఔరా! ఔరా! ఎంతవాఁడ వయ్యా ప్రభూ! ఇంక మేమేమి చెప్పుము? సరే కానిండు! మీ యిష్టమే మా యిష్టమని శర్విలకుఁడు వయితొలఁగెను. అమ్మయ్యో! బ్రదికి బైటపడితినని శకారుఁడు లేచి చారుదత్తుని కాళ్ళకు మ్రొక్కెను. వీని యుద్యోగము వీనికే ఈయవలెనని చారుదత్తుఁ డాజ్ఞాపించెను.

అయ్యా! ఇదుగో! శాక్యభిక్షుఁడు. వీని కేమి బహుమానమని శర్విలకుఁడు హెచ్చరించెను

ఏమోయీ! నీకేమి కావలెనని చారుదత్తుఁ డాతనిని ప్రశ్నించెను. అయ్యా! నాకింకేమి కావలెను? ఈ కథవల్ల ఈ ఘట్టములవల్ల మానవుల బ్రదుకులనుగూర్చి లెస్సగా అంతుపట్టినది. ప్రపంచము అనిత్యమనుమాట చక్కఁగా బోధపడ్డది. కావున సన్న్యాసమందే నా బుద్ధి లగ్నమై పోయెనని వాఁడు సిక్షుఁడై పలికె. సరే! మంచిదని చారుదత్తుఁడు మెచ్చుకొని ఆతని కోరికి తీఱునట్టులు సర్వబౌద్ధాలయములకు వానిని కులపతిగాఁ జేసివైచెను. తక్కిన వారిమాట యేమని శర్విలకుఁడు మఱల ప్రస్తావమెత్తెను. వెంటనే స్థావరకునకు దాస్యవిమోచనము చేసిరి. తలారులకు వారికొలములో పెత్తనమిచ్చి

సన్మానించిరి. చందనకునకు పృథివీదండపాలకత్వము ప్రసాదించిరి.

ఎక్కడివా రక్కడ ఆనందించి కేజేలు పెట్టుచు జయజయలు కొట్టుచు ఎవరిత్రోవను వారు పోయిరి.

రవ్వంతకాలములోనే రాజ్యము సుభిక్షముగా మారిపోయెను. ఆర్యకమహారాజు మారాజని ఎల్లవారు మన్నించి భక్తిమై కొల్వసాగిరి.

అయాచితోపస్థితయైన కుశావతీ రాజ్యలక్ష్మిని పరమపతివ్రతాశిరోమణియైన ఇల్లాలు ధూతాంబను త్రిలోకసుందరియైన ప్రియకాంత వసంతసేనను అల్లారుముద్దుగా ఏలుకొనుచు చారుదత్తుడు మహారాజుగా చిరకాలము సౌఖ్యము లందెను.



ది ఓరియన్‌ట్ పవర్ ప్రెస్, తెనాలి కా. 500/11-48